# దైవోక్తి

( పరిశోధక నవల. )

1టవ. భాగము.



ప్రకాశకులు.

శ్రీకృష్ణా బుక్ డిపో,

రాజమండ్రి.

[illegible], రాజమండ్రి.

1930.

## పీఠిక.

ఒకానొక యాంగ్లనవల నాదర్శకముగా తీసికొని చాల మార్పులతో తయారుచేయబడిన దిది. ఇందలి కథ యాంధ్ర దేశములోని యొక మూలకు చెందియుండి యీర్ష్యా పూరితుడైన 'ఏకాక్షి' యను నొక సామాన్యుడు మన్యపు ప్రదేశములలో నెంత యల్లరి చేసినదియును, పోలీసువారి నెంత యల్లరి పెట్టినదియును, చివరకొక విద్యార్థి మూలమున సంతరించుటయును సూచించుచున్నది. సామాన్య సంఘమునకు చెందిన సామాన్య జీవితములో యుద్రేకములు, యుపద్రవములు పుట్టించి, చివరకు నవాంతరములతో నడక సాగించిన యీకథ పెద్ద పెద్దల వలన గాకపోయినను సామాన్యులవలన నయిన సానుభూతి నందకపోదని యాశపడుచు పాఠకుల యాదరమునకై యెదురు చూచు —

మీ పరిచితుడు,

నారాయణ రావు జీ.

# ఏకాక్షి.



"నాకంతగా నమ్మకము చాలదు. కాని తెల్లవారుజామున మోటారుబూర చాలసారులు కంగారుగా వినవచ్చినట్లున్నది." అని యొక శ్రీకుటీరము వసారలో నిలచియున్న ముగ్గురిలో పొడవుగానున్న పెద్దవానినోటినుండి వెలువడినది. అతడు దాదాపు ఆరడుగుల పొడుగున గంభీరముగా కనుపించుచున్నాడు. అతడే యాయింటికిని, యాప్రాంతములనున్న యున్నతమైన చెట్లతో నిండిన దట్టమయిన యడవి భూమికిని యప్పటి యజమాని సుబ్బారెడ్డి.

అప్పటికింకను పూర్తిగా తెల్లవారలేదు. తెల్లవారుటేమి? చీకటి యింకను దట్టముగా వ్యాపించియే యున్నది. ఇంటికి చుట్టును కొంతదూరమున వరుసగా నావరణక్రింద యేర్పడియున్న యెత్తయిన యీతచెట్లమధ్యనుండి రుయ్యిమని వీచుచున్న చలిగాలి వసారాలోనివారి ముఖములమీద గట్టిగా కొట్టుచున్నది.

అంతలో సుమారు పదియారు సంవత్సరములవయస్సు గల వానికుమారుడు గోపాలకృష్ణుడు మునుపుగా "నాయనా! నేనది స్పష్టముగా విన్నాను" అని తండ్రి యభిప్రాయమును బలపరచి "అది యేమయిన ప్రమాదము సంభవించిన బాటసారుల మోటారుకాదనెవరా?" అని ప్రశ్నించినాడు.

"నా అనుమానమదే. మన మొకసారటు పోయి చూచి వచ్చిన బాగుండును. నాతో నెవరు వచ్చెదరు?" అని యజ మానడిగినాడు.

"ఈమాత్రమునకు మీరు శ్రమపడవలయునా? మే మిరువురమును పోయి రాగలము. కాని యక్కడ సహాయాపే క్షలోపడి దుస్థితిలోనున్న మానవులెవరయిన కనుపించిన...

..." అని రామచంద్ర మనసంతలో యజమాని అడ్డువచ్చి "ఆహా! అంతకన్ననా! వారిని తప్పక మీవెంట నిచటకు తీసికొనిరండు. అందులకు సందేహించనేల? ఇక్కడ నవుకర్లు తగినంతమంది లేకపోయిరి కాని నేనుకూడ వచ్చియుందును. చలియేమి? అవసరము వచ్చినప్పుడు. ఆ చచ్చుసన్యాసి యేకా క్షిని పెట్టుకున్నప్పుడే అనుకున్నాను సమయమునకు మోస గించునని. వా డిప్పుడే పనిమాని పోవలయునా! వాని రకమదే అసలు. ముందయినను బుద్ధికలిగి ప్రవర్తించక పోయిన పక్ష మున నెక్కడనో త్వరలోనే గంగలో పడితీరును. ఊ! దాని కేమి? త్వరగా బయలుదేరుడు మీరుమాత్రము" అన్నాడు.

మరికొన్ని నిమిషములలో నాయువకు లిద్దరును చురు కుగా బయలుదేరి, అద్దుత్రోవను సుమారొక నూరుగజముల దూరముపోయి, కంకరబాటమీద పడి తిన్నగా ముందునకు -అంతకుపూర్వము కొన్ని నిమిషముల క్రిందట మోటారుబూ ర ధ్వని వినుపించిన దిశగా నడిచి పోసాగినారు. అప్పటికి చలి గాలి యింకను తగ్గలేదు. కాని యదివారు పోవు దిశకు వెనుక

నుండి వచ్చుటచే వారి గుండెలునకుగాని, ముఖమునకుగాని, తగలక, వారి గమనమున కాటంకము కలుగచేయక, వారిప్రయాణమునకును వారుచేయబోవు సత్కార్యమునకు సానుభూతి చూపకపోయినను వ్యతిరేకముగా పనిచేయుచుండుట లేదు.

వా రా లాగున సుమారొక మైలుదూరము పోవునంతలో ముందు కొంతదూరమున తీవ్రముగా కన్నుతెరచి చూచుచున్నటుల కనుపించిన వెలుతురుచూచి "అయుగో! మోటారులాంతరు. మనమూరక భ్రమపడియుండలేదు. అది నిజముగా ప్రమాదము సంభవించిన మోటారుకారే. సందేహములేదు." అన్నాడు రామచంద్రము.

"అవును బాటకు ప్రక్కగా నున్నది. రా! త్వరగా పోవుదము. వారే దురవస్థలో నున్నారో! కారు తలక్రిందుకాకపోయిన మాత్ర మదృష్టమంతులమే" అని రెండవ యాతడన్నాడు.

వారు తొందరగా ముందునకుపోయి ప్రమాదము సంభవించిన కారును కలసికొన్నారు.

అది సామాన్యపు రకపుదే కాని వాడక మంతగా లేక మంచిస్థితిలో నున్నది. వెనుకచక్రపు రబ్బరుగొట్టములో మేకుదూరి పెద్ద రంధ్రముపడి యాకస్మికముగా గాలిపోవుటచేత ప్రక్క కొరిగి, స్వల్పముగా సంభవించిన ప్రమాదముచే లోపలివారి కంతగా గట్టిగాయము లేనియు లేకపోయినను, ఒకరిద్దరకు స్వల్పముగా దెబ్బలు మాత్రము తప్పలేదు.

"ఆహా! అయ్యలారా! మీ కేమియు ప్రమాదములు సంభవించలేదుకదా? మీ రెచ్చటనుండి వచ్చుచున్నా రింత రాత్రివేళ!" అని గోపాలకృష్ణు డడిగినాడు.

"ఆహా! అంతగా లేదు కాని—అయ్యా! మీ రిచ్చటి కేల వచ్చినారు? భగవంతుడు మాసహాయార్థము పంపినదే-"

"కాదు. మీ బూరవిని యీ ప్రాంతములలోనున్న రెడ్డిగారు పంపగా వచ్చినవారము. మీ యోగక్షేమములు విచారించి, మీకు తగిన సహాయముచేసి, విశ్రాంతికోసము మిమ్మందర నక్కడకు తీసికొని రమ్మని వారు సెలవిచ్చినారు" అని రామచంద్రము సమాధానము చెప్పి కారుయజమానివై పాత్రముగా చూచినాడు.

"అవును. మీయందరకు వందనములు. మేము నిజముగా సహాయమపేక్షింపవలసిన స్థితిలోనే యున్నాము. మా కెవరికి నంతగా యవసరములేదు. మానవుకరు డ్రైవరు ప్రక్కకూర్చుని ప్రక్కకు తూలిపడినందున కాలు చీలమండ యతుకులో నొప్పిపెట్టి మూలుగుచున్నాడు. నాకు కొంచెము నడుము బెణికినది గాని దానిబాధ యంతగా కనుపించక, గాలి పోయిన చక్రమువైపుగా కూరుచున్న మా సీతారత్నముకు తలమీద తగిలిన గాయమునకు నేనేగదా కారణమని మిక్కిలి విచారించుచున్నాను. నే నావైపునకు తూలి పడకపోయిన పక్షమున నాతల యామెతలకు తగిలి యామె తలను ప్రక్క కమ్మిమీద విసరికొట్టి యుండదు. అయినను అంతగట్టిదెబ్బ తగిలియుండదామెకు." అని మొగమోటము విడచి చెప్పినాడు.

"ఇంతకు నందరిలో దెబ్బతగలక మిగినవాడను నే నొక్కడనే" అని డ్రైవరు సగర్వముగా నన్నాడు.

"నీకేమి? నీ తత్వమట్టిది. నీకు తగిలినను, తగులనట్లే. మీమోటారుడ్రయివరు జాతి యొక శ్రోత్రరకము జాతి." అని గోపాలమన్నాడు. వానికి చిన్నతన మింకను వదలలేదని రామచంద్రము తరుచు అనుట కదియే ముఖ్యకారణము. వారిద్దరును మేనత్త, మేనమామ బిడ్డలు. సుబ్బారెడ్డి వ్యవసాయము నిమిత్తము కొన్నిసంవత్సరముల క్రిత మాప్రాంతములకు వచ్చినప్పుడు వారిద్దరనే వెంటబెట్టుకొని వచ్చినాడు.

మోటారు యజమాని చెప్పుచుండిన ప్రమాదముల జాబితా వినుచుండిన రామచంద్రమునకు కృష్ణుని మాటలు చెవిని బడలేదు. అతడసలు ప్రమాదము సంభవించినందులకే విచారించుచుండు నంతలో, నాడుదానికిని చిన్నపిల్లకును దెబ్బతగిలినదని వినినతరువాత మనస్థిమితమే లేదు. గుండెలు కొట్టుకొన నతడు కారుదీపపు వెలుతురునుండి ప్రక్కకుతగ్గి రెండవవైపున నున్న యజమానుని దిగుమనిచెప్పి, కాలువిరిగి కదలలేక పడియున్న నవుకరువలన సహాయ మపేక్షించియు లాభములేదని గ్రహించి, నెమ్మదిగా కారుప్రక్కకు పోయి బండిలోప్రవేశించి దెబ్బతగిలి చాలవరకు స్మృతిలేక పడియున్న చిన్నదానిదగ్గర చేరి, యంతవరకు ప్రక్కకమ్మీకి తల జేరవేసి పడియున్న యామెను జెబ్బలసహాయమున నెమ్మదిగా లేవదీసి కూరుచుండబెట్టుటకై ప్రయత్నించి వెనుకకు త్రిల్లి

పడినాడు. ముసలివాని మాటలనుబట్టి యత డభిప్రాయ పడినటు లామె చిన్నపిల్లగాక యంగసౌష్టవము కలిగిన యువతి అతడు తృళ్లిపడుట కదియే కారణము.

అంతవరకు రెండవప్రక్కను లోపలజేరి యజమానుడు క్రిందకుదిగుటకు సహాయముచేయుచున్న గోపాలము తృళ్లి తనమీదపడిన రామచంద్రునివైపు తిరిగి కారణమేమని నెమ్మదిగా నడిగినాడు. రామచంద్రము కంగారుపడుచు రహస్యముగా "దీపము! దీపము" అన్నాడు మెల్లగా.

కారణము బోధపడక గోపాలము ముసలివానిని క్రిందకు దింపి, తొందరగా కారుముందునకుపోయి తమరు వచ్చునపుడు వెంటతీసికొనివచ్చి పరాకుగా కారుముందు, దూరమున నుంచిన చేతిలాంతరు తీసికొనివచ్చినాడు. వా రా దీపపుసహాయమున లోపలనున్న యువతిని తీరుబడిగా చూచినారు. ఆమె కుడికణతకు కొంచెముపైన, తలవెంట్రుకలు బయలుదేరిన ప్రదేశమున కమ్మి గట్టిగా తగులుటచే పడిన గాయమునుండి స్రవించిన రక్తము వలన నంతవరకు స్మృతి తప్పి పడిపోయినను, పడుచువాండ్రిద్దరు కంగారుపడుచు చేసిన సందడివలన స్వల్పముగా స్మృతికలిగి, దీపపువెలుతురున వారిని చూచి మరల రెప్పలు వాల్చి ప్రక్కకు జేరబడినది. అంతయు రెండునిమిషములకు తక్కువకాలమున. అదంతయు శ్రద్ధగా కనిపెట్టి చూచుచుండిన యజమాని "అయ్యో! సంగతేమి!" అని నీరసముగా నడిగినాడు. సంగతంతవరకు వచ్చిన

దని గాని, గాయమంతగా తగిలినదని గాని యతి డనుమానించ నయిన లేదు.

"అయ్యా! గాయము కొంచెము గట్టిగనే తగిలినటు లున్నది." అని కృష్ణుడు ముసలివాని ప్రశ్నకు సమాధానము చెప్పినాడు. యజమాని "అయ్యో! అయ్యో! ఎంతపని జరిగినది. ఎంత బుద్ధిమాలినతనము. నే నంతవర కనుమానించ నయినలేదు. "దెబ్బతగిలినదా అమ్మా!" అని నే నడిగినప్పు డామె "ప్రక్కకున్న కణతకు కొంచెము తగిలినది. అంత లెక్కలోనిది కాదు. మీ రా విషయమై బెంగగొన నక్కర లేదు. మీ కేమియు దెబ్బతగులలేదుకదా? పెద్దవారని నెమ్మదిగా నా యోగక్షేమము లడిగినపుడు నే నే మనుకొన వలసినది? ముద్దుతల్లీ! ఎంతపనిచేసితివే! నే నెంత తెలివి తక్కువ సన్యాసిని!" అని తనను తాను మరియు, మరియు నిందించుకొని పశ్చాత్తాపపడుచు ప్రకృతము మరచినాడు.

రామచంద్రమును, కృష్ణుడును సంశయమును దూరముగా పారద్రోలి, వారివెంట తెచ్చిన తాబేటికాయలోని నీటితో గాయమును, దానినుండి స్రవించిన రక్తమును బాగుగా శుభ్రపరచి, గాయమువీూద వేయుటకు మందులేనందున దానికి గాలి తగలకుండ, మీూద దుమ్మపడకుండ, వారి జేబురుమాలొకటి చుట్టుతిప్పి కట్టినారు. గోపాలము చిన్నతనము చేతనో మరియేహేతువుచేతనో నంతగా బాధ్యత వహించ

లేదు గాని రామచంద్రము మాత్రము మిక్కిలి శ్రద్ధాభక్తులతో కార్యమంతయు స్వయముగా పూర్తిచేసినాడు.

తరువాత వారినందర నింటికి జేర్చ వలసిన పనియొకటి ముఖ్యమయినది. నవుకరు కాలు బెణికినప్పటికిని కొంచెమోపిక పట్టి కుంటుకొనుచు నయినసేదోవిధముగా నెప్పటికయిన నిలు చేరగలడు. మనుమరాలికి తటస్థించిన ప్రమాదముచే ముసలి వానికి సంభవించినది కానవచ్చినదికాదు. లేనిపక్షమున నట్టివాని కా వయస్సులో కలిగినది స్వల్పమయినను విశేషముగనే కనుపించును. డ్రైవరు యింటికిపోకుండ నక్కడనే కారు దగ్గర కాపుండవలయును. మరమ్మతులోపడినకారు జెబ్బల సహాయమున గెంటుకొనిపోవు మానవసముదాయ మింటిదగ్గర నుండి వచ్చువరకును యతడచ్చటినుండి అటు నిటు కదలిపో వీలులేదు కదా! ఇక స్వల్పముగా స్మారకము కలిగినను యింతమాత్రమును బారుధ్యము చాలని యా కాంత నింటికి చేర్చవలయును. ఆమె తనంత కదలలేక పరసహాయముకొరకు కాసపెట్టుకొని యున్నది. అందులకు మిగిలినవారివురు మాత్రము—రామచంద్రమును గోపాలమును. గోపాలము తప్పనిసరియని చేయుచున్నాడు. రామచంద్రము మాత్రమటులగాక సొంతవ్యాపారముకన్న నెక్కువ యూవ్యాయముగనే చేయసాగినాడు. వారు చెంతనున్న నొక వెదురుడొంకదగ్గరకు పోయి, ఆరు, యేడు యడుగులపొడవుగల రెండు బలమైన సావు వెదురుకర్రలు నరికి తెచ్చి వాటికొక బరకపుగుడ్డ కట్టి, మధ్య దాన్ని

లాగునచేసి, ఆయాసము కలుగకుండ రోగిని తీసికొనిపోవుటకు వీలుగనుండు నొకవిధమైన పనిముట్టు (Stretcher) తయారు చేసినారు.

ఇక వారాచిన్నదాని నందు పరుండ పెట్టవలయును. అది పెద్దచిక్కులాగున కనుపించినది రామచంద్రమునకు. చిన్నదికూడ నెంత నీరసముగా నున్నను అట్టి యువకులు చేతులతో తాకి సహాయము చేయుట యామెకంత యిష్టముగా నున్నటుల కనుపించదు. కాని యేమిచేయగలదు? గత్యంతరము లేదు. రామచంద్రము సందేహించుచు నుండెను. మునలాయన సంగతి కనిపెట్టి తాను చేయగలిగిన దేదియు లేకపోవుట చేత గ్రుడ్లు మిటకరించుచు దూరమునుండియే హెచ్చరించ సాగినాడు. అప్పటికయినను రామచంద్రము తెగించనందున గోపాలము ముందునకువచ్చి, చిన్నదానిని హెచ్చరించి లేవతీసినాడు. ఆమె వానియెడల సోదరభావము కలదై కొంత ప్రయత్నముచేసి వాని సహాయమున లేచి నిలచినది. రామచంద్రము కారుప్రక్కకు కర్రలతొట్టి తీసికొనివచ్చి, పట్టుకొని నిలుచున్నాడు. గోపాలము రెండవకొనకువచ్చి తొట్టి నెడల్పుచేసి పట్టుకున్నాడు. వెనకవైపునన్న రామచంద్రమప్పుడా కాంతకు యాసరాయిచ్చి చేయిపట్టుకొని సందేహించుచు నయినను యామె యందు పడుకొనుటకు సహాయపడక తీరినది కాదు. ఆకాంత సిగ్గుపడుచు భీతియపడుచు నయినను వాని సహాయము పొందక తీరినదికాదు. గోపాలము విషయములో

నామెకు లేనిసిగ్గును సందేహమును వీని విషయమున నేల బయలుదేర పలసివచ్చినది. అందుకామె జవాబుదారికాదు. ప్రకృతి లక్షణము.

వానా చిన్నదానిని తీసికొని—మోసికొని ముందునడచుచు దారితీసి దారి చూప సాగినారు. యజమానియును నవుకరును యీడ్చుకొనుచు కష్టప్రియత్నమువిూద వారివెంట యేదోయొక విధముగా ప్రియాణము సాగించుచున్నారు. ము సలివాని కంత బాధ లేదుగాని, నవుకరును, ఆకాంతయు ను త్వరలో వైద్యునిసేవ యపేక్షించు స్థితిలో నున్నారు. రామచంద్రము వారిని హెచ్చరించుచు, ఇల్లుచేరిన తక్షణమే బాధ నివారణ కాగలదనియును, అక్కడంత తెలివితేటలు గల వైద్యుడొకడు లేకపోయినను యజమాని—రెడ్డిగారా విషయమున మంచి ప్రిజ్ఞగలవాడనియును పోయినకాలునకును, తగిలిన గాయమునకును సాధ్యమయినంత త్వరలో చికిత్స జరుగ గలదనియును ధైర్యము చెప్పినాడు. ఆవిధముగా నా యూరేగింపు కొంతదూరము పోయినది. వారసలు పోవలసిన దూరము సుమారొకమైలు దగ్గరగానున్నది. అంతవరకు గడచినది యెన్నవవంతు కూడ కాలేదు. నవుకరు బాధపడుచు మూలుగుచు కాలీడ్చుచు రెండవకాలే యెక్కువ యాధారముగా ప్రియాణము సాగించుచున్నాడు. నడక సాగనందులకు గోపాలము రుసరుసలాడుచు నవుకరువైపు తిరిగి నెమ్మదిగా గసరసాగినాడు. ఇల్లు చేరగలుగుటలో యాలస్యమునకు నవుక

రే యెక్కువ పూచీదారనియును, అందు మూలమున చిన్న దానికి చికిత్స చేయించుట కాలస్య మగుచున్నదనియును రామచంద్రమునకు తోచియుండుటచే నవుకరుపై గోపాలము కన్న రామచంద్రమునకే యెక్కువ కోపముగానున్నను కష్ట సుఖములు బాగుగా గ్రహించగలిగిన యాతడు నవుకరును నిందించుట సహింపజాలక వానిని గసరిన గోపాలమును మృదువుగా మందలించ సాగినాడు. నవుకరు చేయునదిలేక త్వరగా నడవదలచుకొనినను సాగదని తెలిసి పురాకృత ఖర్మమును దూరుకొనుచు గమనమును హెచ్చించదలంచుకొనియు హెచ్చించలేకపోయినాడు.

వా రా విధముగా సాగిపోవునంతలో నవుకరు "చచ్చితినిరా బాబూ!" అని ఒక చచ్చుకేక వేసి, కాలుపట్టుకొని వెనుకకు కూలబడినాడు. అందరును కంగారుగా వెనుకకు తిరిగి చూచినారు. కారణ మడిగినారు. అతడు హీనస్వరమున "ఏదో రాయి రుయ్యిమని వచ్చి, నాకాలునకు తగిలి ప్రాణము తీసినది" అని చెప్పినాడు.

"మతిపోయినదా యేమి? రాయి యెచ్చటనుండివచ్చినది నీకు?" అని గోపాలము నిరసనగా వేళాకోళము చేసినాడు.

రామచంద్రమడ్డువచ్చి "ఆ! అదేమన్నమాట!" అని గోపాలమును మందలించి, నవుకరువైపు తిరిగి సంగతేమని మరియు మరియు నడిగి యేదో రాయి దూరమునుండి వచ్చి దెబ్బతగిలి వాచిన కాలుమీదనే తగిలెనదని చెప్పి

బాధ సహించుకొనలేక యేడ్చు నవుకరు నోదార్చి, చే తులలో బరువుండుటచే నంతకన్న వే రేమియు చేయ లేక మరికొంచెము నెమ్మదిగా నడువప్రారంభించినారు. మరియొకటి రెండు నిమిషములలో దూరమునుండి మరి యొక రాయి రుయ్యిమని వచ్చి గోపాలము ప్రక్కనుండి దూసికొని పోయినది. వారాశ్చర్యముగా 'ఏమిది' యని యా లోచించునంతలో మరియొకటి రెండు రాళ్ళు యదివరకువలెనే వారిమధ్యనుండి దూసికొనిపోయినవి. భగవదనుగ్రహముచే నందొకటియైనను వారికి తగులలేదు కాని కావలసినంత కం గారుమాత్రము చేసి విడచినవి. కారణ మెంతమాత్రమును బోధపడినదికాదు. అప్పటి కప్పుడే చాలవరకు వెలుతురు వచ్చినది. రామచంద్రము వలదని యెంతవారించినను వినుపిం చుకొనక, దుడుకు స్వభావుడగు గోపాలము తానంతవరకు పట్టుకొనియున్న తొట్టికఱ్ఱల కొసలు, చేరువనున్న యెత్తయిన యొక రాతిమీదనాన్చి, ముసలివానిని చెంతనుండి చూడుమని చెప్పి, తొందరగా, రాళ్ళువచ్చిన దిక్కునకు పోయినాడు. అక్కడ వాని కేదియును కనుపించలేదు. కాని చేరువనున్న డొంకలచాటున పారిపోవుచున్న మానవుల సందడియును, ఒకటి రెండు మాటలును వినుపించినవి. అందొకటి యేకాక్షి గాని స్వరములాగున నుండుటచే యదంతయు వాని తుంటరి తనమని గ్రహించి, ఆరాళ్ళలోను, గుప్పలలోను, యప్పటిక ప్పుడే పరుగుప్రారంభించిన వానిని వెంటాడి పోయినను లాభ

ము లేదని గ్రహించి, తీవ్రముగా వెనుకకు తిరిగివచ్చి సంగతం తయు రామచంద్రమునకు చెప్పినాడు. రామచంద్రమునకు కూడ చాల యాశ్చర్యము కలిగినది. వాడావిధముగా వడిసెలతో రాళ్లు రువ్వి వారి నారికెళ్ళని డీకొనుటకు కారణమెంత యూహించినను బోధపడినదికాదు.

ఏకాక్షి — అత డదివరలో సుమూగారు మానసుల క్రిందట యక్కడచేరినాడు. అతడు తిరిగి తిరిగి గతిలేక కడుపుమాడి ముష్టియెత్తుకొనుచు, నాప్రాంతములకు వచ్చినప్పుడు సుబ్బారెడ్డి వానిని చూచి, జాలిగొని, యాదరించి, తినతిండియు, కట్టగుడ్డయు నిచ్చి, వానిని తన దగ్గరనుంచుకొని, పనిచెప్పినాడు. కాని యాతుంటరికది సరిపడినదికాదు. పని పాటలు చేతగాక నేర్చుకొనుటకు ప్రయత్నించక, చేయగలిగిన దయినను చేయ సమకట్టక, అందరితోడను తగువులాడు స్వభావముగల యా తుంటరి చిక్కిన మొకటి యవకాశమును దొరకపుచ్చుకొని, అనవసరముగా యజమానితో తగువులాడి యా క్రిందటిరోజుననే పనినుండి పారిపోయి మంచి యవసరసమయమున వారిని మోసగించినాడు. అంతవరకు రెడ్డియింటిదగ్గర తినినది చాలక, మెలకువ కలిగి, [illegible]దుసకుకూడ కొన్ని దినములవరకు సరిపోవునటుల [illegible] దొరకునట్లుకూడ న. గ్రహించి జాగ్రత్తపెట్ట కలిగినాడు. అట్లుపోయిన తరువాత మొకటి విధముగనే తిరిగి తిరిగి ముష్టియెత్తును తానే దర్పకథయూ చెప్పి మరియే యొకరినో యాశ్రయించవలయును. ఆశ్రయించగలడు కూడను.

"తుంటరి ముండకొడుకు. మన పనిలోనుండి పోయినా డు. కని విరుగడయినటులున్నది" అన్నాడు రామచంద్రము.

"కంటికి కనుపించలేదు. వానిసంగతి తేలియుండును." అనుచు గోపాలము కడుపుమంట తీర తిట్టుచు ముసలివాని వేదాంతమును వినుచు, వారి బరువుతో, నవుకరును వెంటపెట్టుకొని యిల్లు చేరినాడు.

సుబ్బారెడ్డి ముంగలివాకిట కెదురువచ్చి వారి నాహ్వానించి లోపలకు తీసికొని పోయినాడు. ఎవరికి కావలసినది వారికి సరుదు పాటుచేసి, నవుకరును నవుకర్ల శాలదగ్గరనుంచి, అక్కడ వానికి తగిన వసతి యేర్పరచి నలిగిపోయిన వానికాలు తగురీతి కట్టుకట్టి యొక మంచముమీద పరుండబెట్టి, యక్కడ నుండి కదలవలదని కచ్చితముగా చెప్పి, వానికి కావలసిన దొ సగుచుండుమని వాని సొంతనవుకర్లతో చెప్పి, వెలుపలకువచ్చి వారియింటనే శుభ్రమయిన వేరొకగదిలో వసతియేర్పరచి, గాయమునకు కట్టుకట్టి చిన్నదానినికూడ పరుండపెట్టి, గాయ మంత ప్రమాదకరమయినది కాదనియును, త్వరలోనే మాన గలదనియును యాత్రముగా మంచముచుట్టును తిరుగుచున్న తాతగారికి ధైర్యముచెప్పి, యింట వారి స్వజన మాదువారెవ రును లేనందున నవుకరుభార్యనక్కడ నుపచారము నిమిత్తము నియోగించి తాతగారిని నిత్యము దగ్గరనుండుమని సలహాయిచ్చి, సుబ్బారెడ్డి వెలుపలకు వచ్చినాడు. తరువాత యేకాక్షి గాని కథంతయు విని చాల యాశ్చర్యపడి వారును పాలు

పోసి పెంచుట యన నిట్టిదే నని చెప్పాచు, వాని విషయమై యంతగా నాలోచించక మరచిపోయి ముందు పని చూడు మని కుర్రవాండ్రను హెచ్చరించినాడు.

అతడు లోపలకు వెడలిపోయిన తరువాత గోపాలము పిడికిలి పట్టి తీవ్రముగా "మరచిపోవుటయా వాని సంగతి? తుంటరిముండకొడుకు. నా కంటబడిన నొక్క గ్రుద్దుతో వాని తల చెక్కలగునటుల కొట్టుదును. ఎంత విశ్వాసహీనత! అప్పుడు నా చేతిలో తుపాకి యున్నపక్షమున వాని మెదడూడి క్రింద పడునటుల వానిని తరిమి తరిమి యయినను కొట్టి యుందును" అన్నాడు.

రామచంద్రము నవ్వినాడు. "సన్యాసి ముండకొడుకు వానితోనేమి? వాని సంగతిక మరచిపొమ్ము. రేప టెల్లుట వాని యంతట వానికే బుద్ధివచ్చును. రా! లోపలకుపోవుదము. త్వరగా స్నానముచేసి పొట్టల కింత పడవేయవలయును—కం గారు పడుచున్నవి. ఫలహారమును, కాఫీయును, యేడ్చుచు చున్నవి." అనుచు నతడు గోపాలమును లోపలకు తీసికొని పోయినాడు.

  

# ౨

సుమారొకమాసము గడచిపోయినది. ఆముదము మర్దనతోను వేడినీళ్ళ కాపడముతోను నవుకరు శీలమండలోనినొప్పి చాలవరకు సరుదుకొనినది. కనుగొనువారు లేనప్పుడు కష్టములు త్వరగా గట్టెక్కును. ఓదార్చువారు లేనప్పు డేన్పులు త్వరలో యుపశమిల్లును. అతడు నీరసముగా నున్నను చాలవర కోపిక తెచ్చుకొని, యా యింటి చుట్టుప్రక్కలను యావరణలోను పచారు చేయసాగినాడు. వాని కా సమయమున పొడుగుపాటి చేతికర్రి మంచి సానుభూతి చూపినది. సీతారత్నమునకు తగిలిన గాయము ప్రారంభదశలో తీవ్రమయిన జ్వరము కనుపించి కొంత కంగారు చేసినను క్రమముగా త్రోవలోనికి వచ్చి చాలవరకు తిరుగు ముఖము పెట్టినది. ఆ యింటినవుకరు మంగడు ముసలాయనతోపాటు నిత్యము మంచముదగ్గర కనిపెట్టుకొనియుండి చిన్నదానికి కావలసిన సకలోపచారములు చేయసాగినది. రామచంద్రము కూడ వ్యవసాయము కొంతవరకశ్రద్ధచేసి యయినను తరుచు యామె యోగక్షేమములు కనుగొనుచు, యవసరముగా నయినను కొంతసే పక్కడ నిలచి సంభాషించిపోవుచు వచ్చినాడు. జబ్బుచే మంచముపట్టియున్నప్పుడేమి, కొంచె మోపిక కలిగి యటు నిటు పచారుచేయు సమయములయందేమి, సీతారత్నము ఖులాసగా కనుపించినది రామచంద్రి మామె కంటబడినప్పుడే. వా రొకరితో నొక

రెన్నడును మాటలాడుకొనకపోయినను చూపులు మాత్రము తరుచు—నిత్యమును పరస్పరాలింగనము చేసికొనుచుండక పోలేదు. పరకాంత నారీతిగా సందర్శించి, యానందించుట పరువృగలవానికి పనిగాదని మందలించుకొని యెన్నిసారులు వారించుకొనినను రామచంద్రము సమయమున కచ్చేటకు పోవుట మానజాలకపోయినాడు. తాతగా రా సంగతంతయు గ్రహించియు, చూచియు చూడనటు లూరకున్నాడు గాని వారించ లేదు. మందలించ లేదు. ఎందుచేతనో యెవరు చెప్పగలరు?

అతడొకరోజున వసారా చివర పడకకుర్చీలో కులాసగా పండుకొని "నాయనలారా! మేము మరియొక వారమురోజులలో మా గ్రామము పోవగలిగిన స్థితిలో నుందుము. మీరు మాకు చేసిన సహాయము మేము మా జీవితకాలములో నెన్నడును మరువజాలము. దానికి ప్రతిఫలముగా నేను మిమ్ము బహూకరించ దలచుకున్నాను" అనుచు నతడు వాని యెడమచేతి రెండవ వ్రేలునకున్న యుంగరముతీసి గోపాలమున కందించుచు "ఇది చాల యమూల్యమయినది. చిరకాలమునుండి--నా చిన్నతనమునుండియు నా చేతి నున్నది. నా జీవితములో నే నెన్నడును దీని నుండి వేరగుదునని యనుకొనలేదు. ఇది నీ వంగీకరించక తీరదు." అని పలికి, రామచంద్రునివంక తిరిగి వానిదృష్టి నెదుర్కొనినాడు. వా రొకరినొకరు క్షణకాలము చూచుకొని గూఢముగా మందహాసము చేసినారు. దానిలో నిమిడి

యున్న భావమేమో వారికయిన బోధపడినదో లేదో యెవరు చెప్పగలరు? బోధపడకుండ నవ్వుదురా?

ముసలిలింగారెడ్డి మందహాస మూపుకొని, చేతియుంగర ములలోని మరియొక యుంగరము తీయ ప్రయత్నించుచు "నాయనా! నీ విది తీసికొనుము. ఇది దాని కెంతమాత్రమును తీసిపోవునది కాదు. నీ వినయమునకును, నీ నమ్రతకును నీవు మాయెడల కనబరచిన శ్రద్ధాభక్తుల కిది యెంతమాత్రమును సరియగునదికాదు. అయినను ప్రస్తుతమిది తీసికొనుము. నీయా యు రేఖావిలాసములకును, నీ గుణసంపత్తికి నన్నివిధముల తగిన మరియొక యమూల్యరత్నము నీకచిరకాలముననే యొసగగల నని నా నమ్మకము. అడ్డుచెప్పక నీ వంతవర కిది—" అను నంతలో రామచంద్రము వాని మాట కడ్డువచ్చి చాలనమ్ర తగా "అయ్యా! తమవంటి వా రొసగ మే మడ్డుచెప్పునదేది? కృషిచేసి యధికగౌరవము సంపాదించిన యా వేళ్ళనుండి చిరకాలసహవాసముచే వియోగదుఃఖ మనుభవించ ప్రాణ మొప్పని యాయుంగరము నేను గ్రహించజాలనందులకు క్షమి యించుడు నన్ను. ఇదివరకే యట్టిదొకటి సంభవించినది. మరియొక యుంగరము తొలగించి యాచేతియందమును పాడుచేయజాలను. క్షమించుడు" అన్నాడు.

ముసలాయన నెమ్మదిగా "సరే. నా చేతిది కాకపోయిన మరియొకరి చేతిది లెమ్ము" అని గొణిగినాడు. మిగతవారికా

సంగతి సరిగా వినుపించియుండదు. వినుపించినను బోధపడు సావకాశము లేదు.

వారు తరువాత మంచి చెడ్డలు ముచ్చటించుకొనుచు చాలవరకు కాలక్షేపణ చేసినారు.

మరునటి యుదయమున పూర్తిగా సూర్యోదయము కాకపూర్వమే యందరికన్న ముందుగ లేచి,ముందువసారాలో నికివచ్చిన కృష్ణు డాకస్మికముగా పెద్ద కేకయొకటి వేసి గుర్లు తెరచుకొని చూడసాగినాడు. అప్పటికి మేల్కొనినను పడక విడచి వెలుపలకు రా హెచ్చరిక చాలని రామచంద్రము తొందరగా వెలుపలకు వచ్చి సంగతేమని యడిగినాడు.

"సంగతేమి, ఓయి? అటు చూడుము. పశువులదొడ్డి" అని గోపాలము సమాధానము చెప్పినాడు.

రామచంద్రము కండ్లు బాగుగా నులుముకొని తెరచి చూచినాడు.

రెడ్డిగారి పశువులదొడ్డి యంతయు కాళీగానున్నది. అందుండు పశువులు సుమారొకయేబది యందు కనుపించవు.

రామచంద్రము వెర్రిమొగమువేసి "అన్నియు పోయి నవే! గుమ్మముకూడ తెరచియున్నది. నిన్న రాత్రి నేనే స్వయ ముగా గుమ్మమువేసి గడియ బిగించినాను. ఎవరో యది తెరచి వాటిని బలవంతముగా వెలుపలకు తోలివేసి యుందురు. కావ లసినంతమేతయు నీరును యున్న యీ ప్రదేశమువిడచి వాటం తటవి పోయి యుండవు" అన్నాడు.

"అవును. బుద్ధిపూర్వకముగా నింత మంచి మేత విడచి పోవుట కవియంత తెలివితక్కువ సన్యాసులు కావు. కాని, యీ గుమ్మ మెవరు తెరచియుందు రనియెదవు? సుకాలివా డెవడ యిన కాడు కదా!" అని గోపాలము ప్రశ్నించినాడు.

సుకాలివారన పని పాటులు లేక వీలు గలిగిన దొంగతనము మీదను, లేనిపక్షమున వ్యాయవారము మీదను కాలక్షేపణచేయు నొకరకపు కొండజాతివారు. వారు, ఒకగ్రామము నుండి మరియొక గ్రామమునకు గుంపుగా పోవుచుందురు. తరుచు పోలీసువారి నిగాలో పోవుచుండినను వారిభుక్తికి దొంగతనముల కాటంకముగాని, అభ్యంతరముగాని యుండదు. వా రప్పుడప్పుడు పశువులను దొంగిలించి యొకచోటవి మరి యొకచోట నమ్ము యలవాటుకూడ కలదు. కాని తరుచు యమ్మకము బాధ పెట్టుకొనక వాటిని కడుపున పెట్టుకొనుచుందురు. అట్టివారు, ఒకటిరెండు తీసికొనిపోగలరుగాని దొడ్డెడి పశువులను తీసికొని పోవరు. తీసికొనిపోయి యేమి చేయగలరు? ఎటుల దాచగలరు? దాగదని భయము.

"నా కిది సవ్యముగా కనుపించుటలేదు. బాబయ్యను లేపుదును." అన్నాడు కృష్ణుడు.

మరియొక క్షణములో రెడ్డి వెలుపలకు వచ్చి, వసారాలో నిలచి నలుప్రక్కల తేరిపార చూచి తలయడ్డుగా నాడించినాడు.

అతడు నెమ్మదిగా "ఎత్తుకొనిపోయినారని నా యను మానము. ప్రశ స్తమయిన మన పశువులమంద వారి కాసగొల్పి యుండును. అవును. ఈమధ్య నీ ప్రాంతములలో పశువుల దొంగతనములు కనుపించవు. ప్రాతకథ తిరిగి ప్రారంభ మయి నటు లున్నది. పనివాండ్రను త్వరగాలేపు. మీరు మాత్రము బూసిగాడు వచ్చి చూచువరకును గుమ్మము దగ్గరకు పోకుడు. గురుతులు త్రొక్కి పాడుచేయగలరు" అన్నాడు.

చిన్నవాండ్రు తొందరగా పరుగెత్తిపోయి వెనుకవైపు వేరుగనున్న శాలలో పరున్న ఉద్దారుడు-ధనరాజును లేపినారు. ధనరాజును వాని భార్యయును రెడ్డి యక్కడకువచ్చిన కొలది దినములలో వాని స్వగ్రామమునుండియే వచ్చినారు. ధనరా జక్కడి వ్యవసాయపుపూచీ యంతయు వహించి యుద్దారుడుగా నున్నాడు. వాని భార్య యాడుదక్షతలేని రెడ్డిగారి సంసారము నకు వంటమొదలగు యితరసహాయముల కేర్పడినది.

ధనరాజు గుమ్మము దగ్గరి కేకలు విని, నెమ్మదిగాలేచి దీర్ఘముగా నావులించుచు వెలుపలకువచ్చి కాళీగానున్న పశు వులదొడ్డి, యు పూర్తిగా తెరచియున్న దాని గుమ్మమును స్థిమి తముగా చూచి తొందరగా పనికి ప్రారంభించినారు.

అతడు చాల కష్టముగా "ఏమి? దొంగిలిపోయినారా? ఎంతపని! చాలపాడుపనే! లేనియెడల నింతసుఖమైన చోటు విడచి పోవలసిన గతేమి వాటికి? కృష్ణబాబూ! నీవు వెళ్ళి

బూసిగానిని పిలుచుకొనిరా త్వరగా. మన మందర మిప్పుడే బయలుదేరి పోవలయును వెతకుటకు" అన్నాడు.

అతడు వెనుకకు తిరిగి మిగతపాలేళ్ళను లేపుటకు పెద్ద కేకలువేసి బిగ్గరగా నరచినాడు. గోపాలమును, రామచంద్రమును, వంటశాలవసారలో స్తిమితముగా నిదురపోవు నలవాటుగల బూసిగాని కోసము పోయినారు. బూసిగాడా ప్రాంతముల కెక్కడకో సంబంధించిన యొకజాతి కోయవాడు. వాని గ్రామము గాని వాని వయసు గాని వాని సంగతి గాని వానికే తెలిసియున్నటుల కనుపించ నందున రెడ్డి కుటుంబమునకు గాని మరియొకరికి గాని యెంత మాత్రమును తెలియదు. అందుచేత మాకును తెలియదు. కనుక మీకును చెప్పజాలము. వాని కేవిధమైన కుటుంబమును లేదు. కొంతకాలముక్రిందట నాప్రాంతములకు వచ్చి తిండి బట్ట యిచ్చుపద్ధతిని రెడ్డిదగ్గర ప్రవేశించి, యప్పటినుంచియు నమ్మకముగా పనిచేయుచున్నాడు. పని పాటులు చేతగాకపోయినను కొన్నిసమయములయందు మిక్కిలి యుపయోగముగానున్నాడు. చిన్న చిన్న చిల్లరపనుల కుపయోగపడుటతోపాటు తప్పిపోయిన పశువులను వెంటాడి తీసికొనివచ్చుట వానిపని. అందు వాని కతడే సాటి.

ఎండిచితుకులు ప్రోగుచేసి వేసినమంట కాగుచు నతడు దూరమున కనుపించినాడు.

"ఓయి! బూసీ! రా! రా! త్వరగా! ఎవడో—బహుశా యిద్దరు ముగ్గు రుండియుందురు మన శాలలోని పశువుల నన్నిటిని తోలుకొనిపోయినారు. నీవుపోయి వారిని పట్టుకొన వలెను" అని హెచ్చరించినాడు గోపాలకృష్ణుడు.

బూసిగాడు బద్ధకముగా సాగ సాగినాడు, కాని వాని కన్నులు మాత్రము చురుకుగా విక్షినవి. వాని కానందము కలుగచేయు పనియే వానికి లభించినది. అట్టి పనిలో వాని కే నాగరికులును చాలరు. జాడలు తీయుటలో వానిని చప్పి మరియొకరిని చెప్పవలయును అప్పటి కప్పుడే చాల ప్రొద్దుపడి నదని దాని వాసనయే చెప్పుచున్న యొక చుట్టపీకకొన నిప్పులలో పెట్టి యంటించి, నెమ్మదిగా నోటపెట్టుకొని పీల్చుచు తీరుబడిగా సమాధాన మారంభించినాడు.

"మీరు వచ్చెదరా? నేను పట్టుకొనవలయునా? అయితే మీదగ్గర తుపాకి ఉన్నదా ఒకటి? నేను ముందుపోయి దెబ్బతిని చావనుకదా!" అన్నాడు.

"మా దగ్గర తుపాకు లున్నవి! నీకు దెబ్బతగలనీయము లే. భయములేదు. త్వరగా లెమ్ము. ఊ! సోమరిపోతా? లే" అని మందలించి హెచ్చరించినాడు గోపాలము.

బూసిగాడు దీర్ఘముగా నావులించినాడు. నాగరికుల లక్షణములలో వాని కెంతమాత్రము నచ్చని దీ తొందర యొక్కటియే. ఏ పనియైనను నిమిషములమీదజరిగిపోవలెనన్న

మాట వాని కెంతమాత్రము పనికిరాదు. అట్టిదొకటి వాని తత్వమున లేనే లే దసలు.

అతడు నెమ్మదిగా "నే నేమయిన తినివచ్చెదను. మీరు కూడ కొంచెము తినిరండు. తరువాత బయలు దేరి పోవచ్చును. అందరము కలిసి" అని మొగమోటము విడచి కచ్చితముగా చెప్పినాడు.

"అవును. నీవు త్వరగా తిండితిని రా. మే మక్కడ సిద్ధముగా నుందుము నీ కొరకు. నీకు మంచి పొగాకు ముక్కలు కూడ యిచ్చెదను రెండు. తెలిసినదా? రా! త్వరగా" అని రామచంద్రుము భ్రమకొలిపినాడు.

ఏదియు చేయజాలని పని యీ మాట చేయగలిగినది. బూసిగానికి ప్రపంచముమీద సర్వసౌభాగ్యములును పొగాకు. దాని తరువాతనే యేదయినను. ప్రస్తుతమది వానిదగ్గర కొరతగానున్నది. రాముని మాటతో వానికి కావలసినంత హెచ్చరిక కలిగినది. అతడు కాలుచున్న చుట్ట తీసి, నిప్పార్పి వేసి, అది యొక్కసారిగా నోట పడవేసికొని బుగ్గను పెట్టి నములుచు యానందముగా "నేనే పట్టుకుంటాను" అని కూనిరాగము తీయుచు లోపలకు పరుగిడిపోయినాడు.

బూసిగాని మాటలో యెక్కువ సబబున్నటుల కనుపించినందున కృష్ణుడును రాముడును తొందరగా యింటిలో పలకు పోయినారు. ఎంతసేపు పట్టునో, యెప్పటికి తిరిగి రానగు

నో తెలియని ప్రయాణమునకు బయలుదేరునప్పుడు, ఆత్మా రాముని సంతుష్టి పరచకుండ పోవుటకన్న వెఱిపని వారియొక టుండదు. వారు పోవునప్పటికి రెడ్డి సర్వము సిద్ధముచేసియుంచి వారిని చూచి నవ్వినాడు.

"మీరు మరచిపోయిన సంగతి జ్ఞప్తికి తెచ్చుకొందురని నే నెరుగుదును. ఆలశ్యముచేయక త్వరగా పూర్తిచేయుడు" అన్నాడు.

మరి పదినిమిషములలో బూసిగాడు సిద్ధపడి, ధనరా జుతో, మరి ముగ్గురు పనివాండ్రతో వచ్చి గుమ్మముదగ్గర నిలచినాడు.

సుబ్బారెడ్డి యింటిసంరక్షణ కొకని నేర్పాటుచేసి తు పాకి భుజమునవేసి చురుకుగా చీడీలుదిగి "మీదగ్గరకూడ నే మయిన నాయుధములున్నవా?" అని మిగతవారి నడిగినాడు.

"నా దగ్గర కోయతుపాకి యొకటున్నది. కాని—వాడు కంటపడగనే కొట్టివేయవలసినదేనా యేము?" అని ధనరా జడిగినాడు.

"ఆహా! ఎంతమాత్రము వలదు. వారు చాలామంది యుండి తిరుగుబాటుచేసి మనకు ప్రమాదము తెచ్చిపెట్టదలచు కొనిన తప్ప. తెలిసినదా? ఊ! బూసీ. ఇక త్రోవ తీయుము" అన్నాడు యజమాని హెచ్చరికగాను.

బూసిగాడు గుమ్మముదాటి ముందునకు పోయినాడు.

మిగతవారు వానిని వెంబడించినారు. కోయవాడు క్రిందకువంగి నలుపక్కల గడ్డి త్రిప్పి నేల పరిశీలించినాడు.

అతడు నెమ్మదిగా "ఒకడు- - ఇద్దరు. ఒకని కాలునకు గుర్రపుకాలున కున్నటుల గుండ్రని యినుపమడమ యున్నది. అందొకనినడక సరిగా యేకాకిగాని నడకలాగున్నది" అన్నాడు.

"ఆహా, అవును. ఇట్టిపని వాని చేతగును. వాడు సరిగా గుంపులవారిలోనివాడు." అనుచు "వారే వైపుగా పోయి నారు?" అని రెడ్డి బూసిగాని నడిగినాడు.

అక్కడకు సుమారొకటి రెండు మైళ్ళ దూరమున ప్రారంభించిన కొండలదిశకు చేయిచూపి, యింకను నేల పరిశీలించుచు యావైపునకే నడవసాగినాడు.

పశువుల శాలకు చేరువనే పచ్చనిగడ్డి యెత్తుగనున్న యొకచోట వారికి పశువుల పదముల జాడలు కనుపించినవి. కాని యవి కొంతదూరమున యేటవాలుగా దిగజారిన యొక రాతిప్రదేశమున త్వరలో నంతరించినవి. గురుతులు నశించినవి—నాగరికులకు మాత్రమే. కాని బూసిగానికి కాదు. అతడు ముందునకుపోవుచు, మధ్య మధ్య కన్నులు నేలకు తగులునంత క్రిందగా వంగుచు, నేల పరిశీలనచేసి చాల తృప్తికరముగా లేచి నిలచి యిటు నటు చూచి కులాసగా మిగతవారిని చేరినాడు.

వారు కొంతదూరము పోయినతరువాత నతడు కచ్చిత

ముగా "ఒక యావు కాలు పోయినది. అది కుంటుచు నీ దిశ గా పోయినది" అని చెప్పి కుడివైపున చాలవరకు చెమ్మగా నున్న నొక ప్రదేశము చూపినాడు. కృష్ణుడును ధనరాజును యావైపునకు పరుగెత్తినారు. కొంతదూరమున వారి కక్కడ బూసిగాడు చెప్పినటు లొక పరమటావు కనుపించినది. ధనరా జా యావును యాపాద్యాయముగా పరిశీలించినాడు.

"దీనిని ప్రస్తుత మిక్కడ విడచిపోవుటయే చాలా మం చిది. మనము తిరిగి వచ్చునప్పుడు వెంటపెట్టుకొని పోవచ్చును. బూసిగా డీ విధముగా కనిపెట్టగలడని తెలిసికొనలేక పోవుటకు యేకాకిగా డెంత బుద్ధితక్కువవాడు!" అన్నాడు ధనరాజు వెనుకకు నడక సాగించి.

అంతలో "ఏకాకిగాడు మనదగ్గర నున్నరోజులలో బూసిగాడు జాడలు తీయవలసివ యగత్యమేమున్నది. అది కాక మనమిప్పటికింకను వానిని పట్టుకొనలేదు కదా" అన్నా డు కృష్ణుడు.

"ఆ. అదెంతవని. వాని నిప్పుడే పిలక పట్టుకొనగలము" అని ధనరాజు సగర్వముగా సమాధానము చెప్పినాడు.

వారింతలో మిగతవారిని కలిసికొన్నారు. వారందరు మరియొక గంటకాలము నడచి కొండల సమీపించినారు. వా రిప్పుడు వర్షాకాలములో నీరుచేరి కాలువగా ప్రవహించు నొక పల్లపు ప్రదేశముమీద నున్నారు.

బూసిగాడు తొలిసారిగా నప్పుడు సందేహమున పడినాడు. అత డేదియు నిశ్చయ పరచజాలక తటపటాయించుచు తల యడ్డుగా నాడించినాడు. అటు నిటు తిరుగ నారంభించి డు. కాని త్వరలోనే జాడ దొరకి ముందునకు పోయినాడు.

కొంతదూర మాలాగున పోయినతరువాత బూసిగాడు చాల యసంతుష్టిగా "అయ్యా! ఒక డీవైపునకు పోయినాడు. మరియొక డావైపునకు పోయినాడు. మన మిందులో నే వైపునకు పోవలయును?" అని యడిగినాడు రెడ్డివైపుచూచి.

దొంగ లిరువురును పశువులమందను విడగొట్టి చెరియొక ప్రక్కకు తోలుకొని పోయినారని వారు స్థిరపరచుకొన్నారు.

"అయ్యా! ఏవైపునకు పోయినను ఫరవాలేదు. ఈ ప్రాంతము లన్నియు నాకు బాగుగా తెలియును. అబ్బాయిల నిద్దరను బూసిగానితో పంపి మన మీ రెండవవైపునకు పోవుదము. మనము త్వరలోనే యీ కొండ తిరిగివచ్చి వారి నావైపున కలసికొనగలము" అని సలహా యిచ్చినాడు ధనరాజు.

రెడ్డి యీ సలహా కామోదించి "సరే బాగుగనే యున్నది. నాయనా! మీరు బూసిగానివెంట పొండు" అని చెప్పి మిగతవారిని వెంట బెట్టుకొని కొండప్రక్కగా పోయినాడు. బూసిగాడు కొంతవరకు సందేహించి, స్థిరపడి యెడమచేతి

వైపు నడువ ప్రారంభించినాడు. వడుచువాం డ్రిరువురును మా టలాడక వానివెంట పడినారు.

"బూసీ! వారిని గురుతించగలిగితివా నీకు మంచి గాట యిన పొగాకు ముక్కలు రెండిచ్చెదను" అని కృష్ణుడు వాని కానగొల్పినాడు. వా డానందముగా చంకలుకొట్టి కొన్నాడు.

వా రా విధముగా కొంతదూరము నడచి సన్నముగా నున్న యొక వాగుదగ్గరకు పోయినారు. బూసిగా డక్కడ నాగి నలుప్రక్కల తిరగిచూచి కంగారుపడ సాగినాడు.

"సంగతేమి? వా రీ దారిని పోయినారా!" అని రామ చంద్ర మడిగినాడు.

బూసిగాడు బిక్కమొగమువేసి యిటునటు చూచి తలవాల వేసినాడు గాని ముందున కడుగిడలేదు.

అతడు చాలా దీనముగా "నీటిగుంట" అని గొణిగి నాడు.

"ఊ. అయితే! దానికేమి? పశువులిక్కడ నీరుత్రాగి పోయిన పక్షమున నంత యెక్కువదూరములో నుండవు. త్వ రగా నడువుము ముందునకు" అని కృష్ణుడు వానిని కరకుగా తొందర చేసినాడు.

అయినను కోయవాడు ముందున కడుగిడ సాహసించ లేదు. చిన్నవాం డ్రిరుపార్శ్వములనున్న యెత్తయిన కొండల వైపు తేరిపార చూచినారు. ఏకాక్షియు వాని యను

చరుడు నా కొండలమీద నెచ్చటనయిన యుండుట తటస్థించెనా వారా యెత్తునుంచి దిగువనున్న వీరిమీద పెద్ద రాళ్లు దొర్లించి నిజముగా వీరి కొంప తీయగలరు.

రామచంద్రము కృష్ణుని యభిప్రాయము గ్రహించి "వారీ ప్రాంతములలో కొండలమీదకు సులువుగా పోగల ప్రదేశ మేదియు లేదు. అంతవరకు నాకు తెలియును. అది కాక వారు పశువులను విడిచి పోజాలరు. బూసీ! పై కెక్కుము. ఏమి? సందేహించెదవు!" అన్నాడు.

కోయవాడు తలవాల్చి బాటకనవ్రేలితో నేల గోకుచు గడ గడ వణకుచు, కంగారుగా "నీటిగుంట. పెద్ద అగుడు" అని గొణిగినాడు.

గోపాలము తీవ్రముగా "ఛా! నడువుము. మే మగుడును చంపివేయగలము—తుపాకి క్రింద" అని గద్దించినాడు.

బూసిగా డెంత యిష్టములేకపోయినను ముందునకు నడువక తీరనందున చాల భయముగా యిటు నటు చూచుచు వారిద్దరకు దగ్గరగా నుండునటుల మాత్రము చూచుకొని నడక సాగించినాడు.

'అగుడ'ను నది లోతు నీటిలో నివసించు నొకవిధమైన ప్రమాదపుజంతువనియును నులకతాడులాగున సన్నముగా చాల పొడవుగా నుండుననియును, నీట దిగువారికాళ్ళకు చుట్టవేసికొని చంపుననియును చెప్పుదురు గాని యింతవరకు దానినిచూ

చిఱుటుల చెప్పు వా రొక్కరును కనుపించరు. నిజమున కవి యి ప్పుడు సృష్టిలోనున్నటుల కనుపించదు. అవి పూర్వము, నీటిలో నివశించి చిరకాలము క్రిందట యంతరించిన యొకరకపు పెద్ద జంతుజాతిలోనివై యుండును. కోయువాం డ్రా పేరువిని యది ప్రతి నీటిగుంట యందును నివసించియుండునని నమ్మి, యెంతవచ్చినను నీటి ప్రాంతములకు పోరు.

వా రిపు డున్నలోయ చాలవరకు చీకటిగా నుండుటచే పత్తిచెట్లును వారికి భయము గొలుపుచున్నది. యువకులు, దగ్గరనున్న యాయుధములను సర్వసిద్ధముగానుంచుకొన్నారు. వారి కగుడనిన నమ్మకము లేదు గాని, తగినంత జాగ్రత్తలో నుండుట యెందుకయినను మంచిదికదా!

ఆ లోయ ముందునకు క్రమముగా మూసికొనిపోయి, యాకస్మికముగా విశాలమయినది. అక్కడ విశాలమయిన చెరువొకటి కనుపించినది. దాని కొకప్రక్కను చేరువనున్న కొండకుచేర్చి యెత్తయిన రాళ్లుకొన్ని యున్నవి. రెండవ వైపున నొక కాలిబాట యున్నది. దానివెంబడినే వారు ముగ్గురును చెరువు చివర వరకు నడచిపోయినారు. బూసిగానికి ప్రాణములు చేతిలోనున్నవి. అయినను, అతడుమాత్రము వాని పని మరచిపోలేదు. అత డా చివ రాగి, నీటికి తగినంత దూరముగానుండియే నీటివారను తొంగి తొంగి చూచినాడు.

"ఇదెవరును రాలేదు" అని చెప్పినాడు.

"వారవతలపైపునకు వచ్చినారు. అదిగో! అవైపున" అని పలుకుచు కృష్ణుడప్పుడు వారు వచ్చినదిశకు చూపినాడు.

"అక్కడ నడచినారు. ఇక్కడకాదు. నీటి దగ్గరగ నడచిన 'అవుడు' అన్నిటిని మ్రింగివేయదా!" అని బూసిగాడు గొణిగినాడు.

రామచంద్రము తీవ్రముగా "ఛా! చచ్చుకబురు. అది కాక యింతవర కెవరును యెన్నడును చూచియుండని యవుడొకటి పుట్టి వచ్చినప్పటికిని యదొక్కసారిగా యిన్ని పశువులను మ్రింగివేయగలదా? అట్టివని కొక యవుడుల మంద కావలయును. ఆలాగయిన నీ కొండలలో పశువులు దొరకనప్పుడు వాటికతి యేమికావలసియుండును? పశువు లీ పరిదేశములకు తరుచు రావుగదా! వచ్చువరకు పోష్యమేనా? అబ్బాయి! కృష్ణా! ఈ కొండవాగు కావలప్రక్క నేదో గుహ యొకటుండియుండునని నా నమ్మకము. ఏకాకి యానంగ తిరిగియుండి పశువుల నన్నిటి నా లోపలకు తోలుకొనిపోయియుండును. అ పశువు లక్కడనేయున్నవి" అన్నాడు.

"అవును. నేను నదే యనుకొనుచున్నాను." అని కృష్ణుడామోదించి "నేనది చూచివచ్చెదను. మీరిరువురు నిచ్చటనే యుండుడు. నీ రంత లోతుగా నున్నటుల కనుపించదు" అనుచు

వతడు చురుకుగా నీట ప్రవేశించి రాళ్లు చాల జారుగా నున్నందున మెలకువగా నడుగులిడుచు నడవసాగినాడు.

రామచంద్రుడు "జాగ్రత్త కృష్ణా! వా రా పక్కల నెక్కడనయిన దాగియుండి తుపాకి యుపయోగించగలరు. నాయనగారూ వారూ వచ్చువరకు తాళిన మంచిది" అన్నాడు.

"రాళ్ళవెనుక గుహాగాని, యేదిగాని యున్నసంగతి నేనొంటరిగా పోయి కనిపెట్టి రావలయును" అనుచు చిరునవ్వుతో ముందునకు పోయినాడు గోపాలము.

నీరు మోకాలిలోతుకన్న నెక్కువ లేదు. కృష్ణుడు చాల జాగ్రత్తగా నడచి యవతలవైపునకు దాటిపోయినాడు.

అవతలవైపున రాళ్ళవెనుక నొక విశాలమైన గుండ్రని లోయ యున్నది. గోపాలమక్కడ నాగి క్షణకాలము శ్రద్ధగా విన్నాడు. అదివర కెన్న డెవ్వరును వానికి చెప్పియుండని దీర్ఘమైన గుహాముఖమొక టక్కడ వానికి కనుపించినది. దానిలో నెక్కడనో మన యేకాక్షియును వాని సహచరుడును దొంగిలించిపోయిన పశువులమందతో దాగొనియుందురు. కాని వీని కేదియును వినుపించుటలేదు. వా రా లోపల దగ్గరగా నున్నటులయిన వారి మాటలసందడి యయినను చిన్నవానికి వినుపించియుండును.

"అది బహుశా లోపలకు చాల పొడువుగానుండి యుండును. నే నదే చూడవలసి యున్నది" అనుకొన్నాడు.

అతడు జాగ్రత్తగా ముందున కడుగులిడుచు, యించు కయిన చప్పుడు కానీయకనే పోయి పరిశీలించినాడు. వాని కంతవరకున్న స్వల్ప సందేహముకూడ నప్పటికి సమసిపోయినది. అక్కడ రాళ్లమీద దూడలు జారిన డెక్కల యానవాళ్లును, బురదలో దిగబడిన యానవాళ్లును, కనుపించినవి. దొంగలును, దొంగసొత్తును యీ మార్గముననే ప్రయాణమయి పోయినది.

గోపాలము గుహలోని నల్లని చీకటిలోనికి దీర్ఘముగా చొరచుకొని చూచినాడు. దూరమున నీరు మెరసినటుల స్వల్పముగా కనుపించినది, కాని వేరేమియు లేదు. అంతయు నిశ్శబ్దము.

"ఇది చాల పెద్దప్రదేశమయి యుండును" అను కొనుచు గుహ గోడలు చేతితో తడుముచు కొన్ని యడుగులు ముందునకు పోయినాడు.

దిగువ నేల కొంతవరకు ముందున కేటవాలుగా నుండి, తరువాత మీదకు లేచినటుల కనుపించినది. గుహకప్పు అంత యెత్తుగాలేక వాని తలమీద రెండుమూడడుగులయెత్తు మాత్రమున్నది. గంటులు గంటులుగానున్న ప్రక్కగోడ లోకడాని కొకటి పది పండ్రెండు యడుగుల దూరముననున్నవి.

గోపాలము వెనుకకు తిరిగి చూచినాడు. అతడు చేయుచున్నది తెలివితక్కువ పని యని వానికి తెలియును. అయినను సంగతి పూర్తిగా తెలిసికొనకుండ వెనుకకు పోవుట వాని కిష్టము లేదు. ఆ గుహకు రెండవ వైపున కూడ నొక మార్గముండి

యుండును. అతడు మరికొంచెము ముందునకు పోయినాడు. అంతలో వానిగుండె యదరునటుల, మందమైన కర్కశస్వర మొకటి ప్రతిధ్వనించుచు వానికి వినుపించినది. అందు పొరపాటంతమాత్రమును లేదు. గిత్తయొకటి లోపల రంకె వేసినది. అది వానికి దగ్గరగానే యున్నటుల కనుపించినది. మంద యక్కడనే యుండియుండును. ఇంకను ముందునకు పోయి ప్రతికక్షుల చేతులలో పడుట యంత తెలివిగల పని కాదు.

"సంగతి తేలినదిప్పటికి. వారిక దక్కినట్లే" అని బిగ్గరగా ననుకొని యతడు వెనుకకు తిరిగినాడు.

అంతలో, నంతవరకు చీకటిలో గోడపల్లములో చేరి యొక ప్రక్కను దాగొనియున్న మానవు లిరువు రాకస్మికముగా వెలుపలకు గెంతినారు. మరుక్షణమున, గోపాలము తుపాకి సరుదుకొనదలచు కొనునంతలో వాని రెండుచేతులును వారికి స్వాధీనము లయినవి. వాని తుపాకి వారికే దక్కినది.

"ఇదీ సంగతి. చిత్తము. గోపాలకృష్ణమూర్తిగారూ! సంగతి తేలినది ఇప్పటికే. అయ్యో! గట్టిగా నార్చకుడు. గొంతుక నొక్కవలసివచ్చును." అని యేకాకీ గాని గొంతుస్వరము వికారముగా వినుపించినది.

కృష్ణుని కన్నులముం దొక కత్తి మందముగా మెరసినది. దానికొన వాని దవుడకు తగిలి, యప్పటికి బయలు దేరబోయిన వాని నోటియరవు నాపివేసినది. నిరర్థక మగునని యతడా ప్రయత్నము మానుకొనినాడు.

అతడు సాధ్యమయినంత శాంతముగా "ఏకాక్షీ! నీ వెంత బుద్ధిహీనుడవు! నీవు తప్పించుకొని పోదలచుకున్నావా? మా దగ్గరనున్న కోయ-బూసిగాడు మీ జాడలు తీసినాడు. మేము సులువుగనే మీ వెంట వచ్చినాము. నన్ను తక్షణము పోని మ్ము" అన్నాడు.

"వాడు చాల బుద్ధిమంతుడు. అది నిజమై యుండవచ్చును. మనము పోవలయునందువు? ఓసీ! అది పెద్దకోరికగాదు. కాని నీ విక్కడకు వచ్చినావు చుట్టరికమునకు. ఇక్కడనే యుండవలయును మాదగ్గర. నీ వదృష్టవంతుడవే యింతవరకు. వానిని ముందునకు గెంటు మామా!" అన్నాడు.

"బూసీ! నీవు నే ననుకొనిన దానికన్న నెక్కువ తెలివి తక్కువ స్యనాసిలాగున కనుపించుచున్నావు? నేను ఒంటరిగా వచ్చితి ననుకొనుచున్నావు కాబోలును? మిగతవారు కూడ యిక్కడ కిప్పుడే రాగలరు. అప్పుడు తమ రెక్కడకు దయచేయుదురో చూడవలసి యున్నది." అన్నాడు కృష్ణుడు

ఏకాక్షి చాల తీవ్రముగా "వచ్చినావులే. నీ తెలివి తేటలకు సంతోషించినాము. సంభాషణ కట్టిపెట్టుము. పండ్లూడగలవు" అన్నాడు.

"వాని వెంట నింకను మనుష్యులున్నారు కాబోలును" అన్నాడు రెండవవాడు.

"నా మొఖము కాబోలును. అది వాని మోసము. నీకంత సందేహముగానున్న పోయి చూచిరమ్ము" అని గేలిసేయు

చు, గోపాలమును చీకటిలోనికి, ముందునకొక గెంటు గెంటి నాడు యేకాక్షి.

ఏకాక్షి సహకారి జోగులు సందేహించినాడు. గుహా ముఖమువైపు తిరిగి నిశ్శబ్దముగా నడుగులు వేయసాగినాడు. ఏకాక్షి యొకచేతితో గోపాలము జబ్బ గట్టిగా పట్టుకొని, రెండవచేతిలోని కత్తితో బెదరించుచు వానిని తొందరగా ముందునకు గెంటుకొనిపోయి, ఆకస్మికముగానున్న మలుపుతిప్పి పైన చిన్న నెరియలనుండి వచ్చు మందమైన సూర్యరశ్మియే వెలుతురుగా గల యొక విశాలప్రదేశము దగ్గరకు తీసికొనిపోయినాడు. దొంగలు సంగ్రహించి తెచ్చిన పశువులు తోచ కక్కడ నటు నిటు మతిమాలి తిరుగుచున్నవి.

ఏకాక్షి నెమ్మదిగా "ఇక్కడెంత బాగున్నదో చూడుము. చల్లగా! హాయిగా! ఏమనియెదవు? విశ్రాంతికి తగిన ప్రదేశ మిది. అవునా? మీ నాయన తెలియక మనకోసము కొండచుట్టు తిరిగి తిరిగి చచ్చుమొగము వేసికొని పోయినతరువాత మనము సురక్షితముగా హాయిగా వెడలిపోవచ్చును. ఏమనియెదవు? అవు ననియెదవా? కా దనియెదవా?" అన్నాడు.

జోగులా చీకటిలో, యేకాక్షి వెనుకకు పరుగెత్తుకొని వచ్చినాడు. వాని ముఖము కనుపించకుండ దట్టమయిన ముసుగున్నది.

అతడు కంగారుగా "ఓయి! ఇతడు చెప్పినది నిజమే మోనమ్ముకాదు. నీటి కావల నిట్టి కుర్రవాడు మరియొకడును,

కోయవాడొకడును కనిపెట్టుకొనియున్నారు. మనము త్వరలో తోక జాడించిన మంచిది. అవకాశముండగనే జాగ్రత్తపడుట తెలివి కలవాని లక్షణము. తరువాత నీచిత్తము మరి” అన్నాడు.

ఏకాక్షి బూతులకు దిగినాడు. అతడంతవరకు మహా తెలివి తేటలగా యేర్పాటు చేసితినని సంతోషించుచున్న వన్నిక లొక క్షణములో తుత్తునియలై మట్టికలసి పోయినవి.

“మన మీ మంద నిచ్చట విడచి పోవలయుననుకొని నుదను. ప్రాణమొప్పుటలేదు, అయినను తప్పనిసరి. కాని..” అనుచు గిర్రున వెనుకకుతిరిగి, కుడిచేయి గుప్పిడి బిగపట్టి, గోపాలముదాడ విరుగులాగున లాగి గుద్దినా డొక గ్రుద్దు; దానితో గోపాలము రెమ్మత్తి వెనుకకు తూలి చాపచుట్టగా క్రిందపడినాడు. స్మారకము తప్పిపోయినది.

ఏకాక్షి వెంటనే జోగులుచేయి పట్టుకొని రెండవవై ంగనున్న చిన్నగుహాలలోని యొక దానిలోనికి పోయినాడు. మరికొన్ని నిమిషములలో వారిద్దరదృశ్యమయినారు. గోపాల మాలాగుననే పడియున్నాడు—కొంతసేపు. తరువాత వానికి త్వరలోనే స్మృతికలిగినది. అయిదు నిమిషములు గడచిపోయినది. పదినిమిషములు. తరువాత నతడంతప్రవేశించిన దిశనుండి పదధ్వని మందముగా వినుపించినది. రామచంద్రము జాగ్రత్తగా ప్రవేశించి గోపాలమును సమీపించినాడు.

అతడు “కృష్ణా! కృష్ణా!” అని గుంజి లేపినాడు వానిని.

కృష్ణుడు మూలిగినాడు. రామచంద్ర మాత్రముగా మరియొకసారి కుదిపినాడు. కృష్ణుడునెమ్మదిగా కన్నులు తెరచి, యెదుట నున్నవానిని వెర్రిచూపున చూచినాడు. తరువాత క్రమముగా త్వరలోనే జ్ఞప్తి కలిగినది.

"ఆ తుంటరి యేకాక్షియును, వానివెంటనున్న జోగులను వాడును. ఏకాక్షి గ్రుద్ది పడగొట్టినాడు నన్ను. పారిపోయినా డనుకొనియెదను" అన్నాడు.

"వారి జాడ కనుపించదు. పశువులను మాత్రము విడచిపోయినారు. మనము పీలుగనుండగనే యిందులోనుండి వెలుపలకు పోవుదము" అని రామచంద్రము సలహాగా సమాధానము చెప్పినాడు.

గోపాలము నెమ్మదిగా లేచికూర్చుని, కాళ్ళు చేతులు సాగతీసికొని, శరీరము దులుపుకొన్నాడు. వేరేమియు లేదు. తలనొప్పియు, దౌడవాపును మిగిలినవి. అతడు కొంతలో లేచి నిలచినాడు.

నలుప్రక్కల తీరుబడిగా చూచి "వా రే వైపుగా పోయినా రనియెదవు?" అని యడిగినాడు గోపాలము.

"అదిగో! ఆ వైపుగా ననుకొనియెదను" అని రామచంద్రము పశువులన్నియు గుంపుగా నిలచి యాత్రముగా చూచుచున్న యొక చిన్నగుహాముఖము చూపించినాడు.

"అయితే మన మది తిరిగి గురుతించ పీలుగనుండునటుల నేదయిన నానవాలు పెట్టుము'' అని గోపాలము హెచ్చరించినాడు.

రామచంద్ర మక్కడ కొన్నిగీతలు గీసి గురుతుపెట్టిన తరువాత వా రిరువురును చెదరియున్న యా పశువులను, తప్పిన త్రోవనే గుహావెలుపలకు తోలుకొనిపోయినారు. అవి పాత పరిచయముగల కంఠస్వరములు వినుటతోడనే తోకలెత్తి హెచ్చరికగా నీటిమధ్యనుండి గెంతుచు చెరువు రెండవవైపునకు పోయినవి. అప్పటికి ధనరాజును, రెడ్డియును, మిగతవనివాండ్రును కొండతిరిగి యక్కడకు చేరినారు.

గోపాలము జరిగిన కథంతయు చాల క్లుప్తముగా వ్యక్తపరచినాడు. వాని తండ్రి తుణకాలమైన వృథవుచ్చలేదు.

అతడు "అబ్బాయీ! నీకు దెబ్బతగిలినదని నాకు చాల విచారముగా నున్నది. నీ దుడుకుతనమే నీకది తెచ్చిపెట్టినది. అయినవేమి లే. ఆ సన్యాసి త్వరలోనే పట్టువడగలడు. బూసీ! త్వరగా నడు. ఏకాకిని నే డేలాగయినను పట్టుకొనవలయును" అన్నాడు.

"నేను నడవను బాబు. అగుడు మ్రింగివేయగలదు" అని బూసిగాడు గొణిగినాడు.

రామచంద్రము తీవ్రముగా "అగు డనున దసలు లేదురా బుద్ధిమాలిన సన్యాసి!" అని ప్రారంభించునంతలో రెడ్డి వాని కడ్డువచ్చినాడు. నచ్చచెప్పి కోయవానిని పురికొల్పినప్పటికిని వానివలన ప్రయోజన మెంతమాత్ర ముండదనియును, వాడు బలవంతము మీద జాడలు తీయజాలడనియును రెడ్డికి.

భాగముగా తెలియును. అట్టివాడు గొంతుక కోసినను పని చేయడు.

అతడు రాజుగా "సరే. మంచిది. వాడు లేకుండగనే మనము పనిసాగించగల మనుకొనియెదను. బూసీ! నీవు రానక్కరలేదులే. ఇక్కడనే యుండి చితుకలుచేర్చి మంట చేయుము. పశువులు చెదరిపోకుండ జాగ్రత్తగా చూచుచుండవలయును సుమా!" అన్నాడు.

"ఓ! అదెంతపని" అనుచు నతడు పుల్లలు ప్రోగుచేయ ప్రారంభించి పాణిముచేత పట్టుకొని, నీటిపొంతకు పోకుండ జాగ్రత్తపడియే వాని పని నెరవేర్చుకొన సాగినాడు. నీటిలో నుండి వచ్చినవాంద్రును, పశువులును క్షేమముగా వెలుపలకు వచ్చినను వానికి "అగుడు" బాధ వదలినదికాదు. వారి మాటలలో నమ్మిక కలిగినదికాదు.

రామచంద్రమును గోపాలమును కలిసి నీటి మధ్యనుండి గుహాలోనికి త్రోవ తీసినారు. మిగతవారు వారిని వెంబడించినారు.

ధనరాజు చీకటిలోనికి పోవుచు "నేనీ ప్రాంతములలో చాలాసారులు తిరిగినాను కాని యిక్కడిట్టి దొకటి యున్నదనియే యెన్న డెరుగను. ఎవరనుకొనగలరు?" అన్నాడు,

"నేను కూడ నొకటి రెండు సారులీ వైపుగ పోయినాను. గుహాయున్నదని యనుమానించుట కయిన నవకాశము

లేకపోయినది. ఈరాళ్ళు దాని ముఖమును తమాషాగా మా టుపరచు చున్నవి" అన్నాడు రెడ్డి కూడను.

తరువాత వా రదివరకు రామచంద్రము గురుతుపెట్టిన దానిని పట్టి లోపలి గుహాదగ్గరకు పోయినారు.

"ఆయుధములు సిద్ధముగానుంచుడు. వా రెచ్చటనైన దాగియుండిన——" అని రెడ్డి యనునంతలో రామచంద్ర ము "అదిగో! ముందు వెలుతురు. సూర్యరశ్మి" అని కేక వేసినాడు.

వారు ముందునకు పోయినకొలది నా వెలుతురు వృద్ధి పొందినది. వారు త్వరలో తెరపిని పడి కొండలమధ్య ప్రవే శించినారు.

దొంగలు పోయిన జాడలు స్పష్టముగా కనుపించు చు న్నవి. వారు జాడలనుపట్టి త్వరగానే నడకసాగించినారు. వారికి ముందు చాలాదూరమున నెవ్వరో పరుగిడుచున్నటుల కను పించినది. అతడు చాలా దూరమున నున్నను వా రాతనిని చాలా సులువుగా గురుతించినారు.

"అడుగో! ఏకాక్షిగాడు" అనుచు ధనరాజు కేకవేసి పరుగు ప్రారంభించినాడు.

మిగతవారుకూడ తొందరగా వానివెంట పడినారు. ఏకాక్షి సంగతి గ్రహించి తప్పించుకొని పోవుటకై రాయి రప్ప చూడకుండ గెంతుచు పోవసాగినాడు. కాని మాట దక్కినది కాదు. ధనరాజు త్వరలోనే వానిని కలిసికొన్నాడు. ముందు

పరుగిడినను లాభము లేదని గ్రహించి చేతిలోని తుపాకి క్రింద పడవేసి తలవంచుకొని చలికిలబడి కూరుచున్నాడు.

ధనరాజు వానిని సమీపించి తుపాకితో పట్టియుంచినాడు.

"ఏకాక్షీ! నీ వదృష్టవంతుడవు. మన దేశ మయినది. దొరల దేశమయిన, నీవు చేసినపనికి కంట బడినతోడనే తుపాకి దెబ్బతిని యుందువు" అన్నాడు ధనరాజు.

"నేను దొంగతనము చేయలేదు. పనివారిమీద కఠినముగా నుండ కుండ రెడ్డిగారికి పాఠము చెప్పవలయునని యీ లాగున చేసినాను. అంతే. దొంగతనముకాదు" అన్నాడు ఏకాక్షి చప్పుమొగము వేసికొని.

"దొరతనమా యిది!"

ధనరాజు తీవ్రముగా "కఠినమా? కడుపు కక్కుర్తి తీర్చుండెనుకా! ఇంతకన్న మంచి యజమాని నెక్కడ దొరుకునురా నీకు!" అని "అయ్యా! ఈ విశ్వాసఘాతకుని ఈ నీచజాతి చండాలుని బ్రతికియుండగనే చర్మము వలచినను పాపము లేదు. ఏమి చేయుమనెదరు!" అని రెడ్డి నడిగినాడు తీవ్రముగా.

దయ దాక్షిణ్య స్వభావుడైన యారెడ్డి రాజుగా "చేతులు జాగ్రత్తగా బిగకట్టి మనవెంట తీసికొని పోవుదము. అప్పుడే సూర్యాస్తమయము కావచ్చినది. ఏకాక్షీ! నీవెంట నున్న యాబుద్ధిమంతు డేడీ!" అని యడిగినాడు.

"తెలియదు. ఎక్కడికో పోయియుండును. నాకు తెలియదు. తెలిసినను చెప్పను" అని యేకాక్షి పలికినాడు.

"వాని సంగతి తెలియపరచిన నిన్ను క్షమించి విడిచిపెట్టుదుము"

"నేను చెప్పదలచుకొనలేదు. నాకు తెలియదని చెప్పినది చాలదా?" అన్నాడతడు మొగరోషముచే.

రెడ్డి హెచ్చరికగా "నీ చిత్తము. నీవు మాత్రము మా వెంటరా. నీ సంగతేమి చేయవలసినదియూ యింటికి పోయిన తరువాత స్థిరపడగలదు." అని "అబ్బాయి బయలుదేరు డింక" అన్నాడు.

అప్పటికి దాదాపు సూర్యాస్తమయము కావచ్చినది వారు బూసిగాడు తయారుచేసిన వంట వడ్డించు నప్పటి కంధకారము మూసికొనివచ్చినది. పశువులన్నియూ సురక్షితముగానున్నవి. అందరి కడుపుల బాధలును పిలుగనున్నంతవరకు తీరిన తరువాత వారా రాత్రి కక్కడనే పరున్నారు. ఏకాక్షి పారిపోవకుండ కాళ్ళుకూడ బిగకట్టి ధనరాజు కంటమేలుకువగనే నిదురపోయినాడు.

రాత్రి నిర్మలముగా గడచిపోయినది. ఉదయమున నందరును తిరిగి ప్రయాణ మారంభించినారు. పశువులనుకూడ వెంట తీసికొని పోవలసివచ్చుటచే ప్రయాణమంత చురుకుగా సాగినదికాదు. వారు యిల్లు చేరునప్పటికి మధ్యాహ్నము మీరిపోయినది. ఆకలికిని, ఆయాసమునకును లోటులేదు.

మరునాటి యుదయమున కాళ్ళుచేతులు కట్లతో యే కాక్షి హారిముందు హాజరయినాడు.

అంతట రెడ్డి "నీ సంగతి యేమిచేయవలయునా యని యాలోచించుచున్నాము. నిన్ను బోలినువారికి స్వాధీనపరచిన చో నేరము ఋజువయి నీ కధమము రెండు మూడు సంవత్సరములకు తక్కువ కేగలదు కారాగారవాసము. కాని నీ పైన సాక్ష్యమునకు మేము పనిచెడి కచేరీలవెంట తిరుగవలసి వచ్చును. తలాగని నిన్నూరక పోనిచ్చుట నా కంతగా యిష్టము లేదు. అందుచేత నీకు జయిలునకు పోవుట యిష్టమా లేక కొరడాతో గట్టిగా దెబ్బలుతినుట యిష్టమా? ఏది కావలయును? మేము చేయునది చట్టమునకు దూరము కాని మనము న్యాయశాస్త్రమునకు మరియు దూరముగా నున్నాము. అందుచేత భయము లేదు. నీ వేదో యొకటి స్థిరపరచుకొని త్వరగా చెప్పు" అన్నాడు.

ఏకాక్షి కొంతకాలము సందేహించినాడు. వానికి తగులు కొరడా దెబ్బ లంత తేలికగా నుండవు. అంతవరకు వానికి బాగుగా తెలియును. అదికాకపోయిన జయిలులో నే రాత్రి గుంజె 'వార్డరు' స్వాధీనమునకో యొకటి రెండు సంవత్సరములు దెబ్బలు పులియునటుల రాళ్ళు కొట్టుట యంత మాటలతో తేలునది కాదు.

అతడు చివరకు "నేను చేదయినను త్వరలో కుదురు నౌషధమునే పుచ్చుకొనియెదను. తలుపులచాటున బంధింపబడు తత్వము కాదిది." అని సమాధానము చెప్పినాడు.

"సరే. మంచిపనే. ధనరాజూ! నీ వా సంగతి చూడుము"

ధనరాజు చాల హెచ్చరికగా "చిత్తము" అన్నాడు.

రెడ్డి చాల కచ్చితముగా "ఇదిగో అబ్బాయి! నీవు తిరిగి యీ చుట్టుప్రక్కల కనుపించితివా మాటదక్కదు. జయిలు తప్పదు. తెలిసినదా? తరువాత నీ చిత్తము. సరే. ఇక తీసికొనిపొండు వీనిని" అని యాజ్ఞాపించినాడు.

మరియొక యరగంటలో ధనరాజు ఏకాకిని పొలిమేర దాటువరకును సాగనంపి చచ్చుమొగము వేసికొని, కునికిపాట్లు పడుచు కుంటుకొనుచు పోవువానిని చాల జాలిగా చూచినాడు. కొరడాదెబ్బలనిన నవ్వులాట కాదుకదా!

ధనరాజు వానితో "అబ్బాయి! ఇప్పటి కేదో యయినది. ఈ ప్రదేశము నీ కంత సౌఖ్యవంతముగా నుండు ననుకొనను ముందు. నీవు దీనికి తగినంత దూరముగా నుండుట మంచిది. నీవు తిరిగి నాకు దొరికితివా నీ శరీరములో దుమ్ములుంతే వన్నమాట. ఇక త్వరగా నడు" అన్నా డాఖరుసారిగా.

ఏకాకి వానిని చాల తీవ్రముగా చూచినాడు. వాని వీపు వాచిపోయినది. నరముల పటుత్వము తప్పినది.

అతడు నెమ్మదిగా "మనము తిరిగి కలసికొనినప్పుడు నే నంతగా దుఃఖపడవలసిన పనియుండదు. కొంత తాళుము. కొన్ని సంవత్సరములు గడచిపోయినను నీ సంగతి మరచిపోను" అని గొణుగుచు, కాళ్లుయెత్తి యెత్తి వేయుచు కుంటుచు కొండలవైపు పోయినాడు.

♦ ♦ ♦

[4]

# 3

చాల వారములు గడచిపోయినది. సీతారత్నము గాయము చురుకుగా మానిపోయినది. లింగారెడ్డి ముందు ప్రయాణము సాగించుటకై తొందరపడసాగినాడు. వారు పోవుచున్న ప్రయాణమున కాకస్మికముగా నాటంకము కలిగినదని వారదివరకే యింటికి వర్తమానమంపినను, యితరులయింట ననవసరముగా నిలచియుండుట వారి కంత మంచిగా కనుపించలేదు.

సుబ్బారెడ్డి తగయిరాలు వలదనినను వినుపించుకొనక లింగారెడ్డి వగయిరా లొకనాడు ప్రయాణమయినారు.

అతడు చిన్నవాండ్రను చూచి "మే మక్కడ స్థిరపడిన తరువాత మీ రొకసారి మమ్ములను చూచుటకు రావలయును సుమండీ" అని కోరినాడు.

"ఆహా, అంతకన్ననా!" అన్నాడు గోపాలము. రామచంద్రము మాత్రము మాటలాడలేదు. ముసలిరెడ్డి సంగతి గ్రహించి "నాయనా! రామచంద్రా! నీవు మాటలాడవేమి? నీవు కూడ తప్పక రావలయును సుమా! నీవు వచ్చిన మేము వేరుగ భావించము లే" అని మందహాసము చేసినాడు. రామచంద్రము స్వల్పముగా కంగారుపడి "చిత్తము. చిత్తము" అని సీతారత్నమువైపు చూచినాడు. అంతవరకు సంగతా మూలాంతము చాటుననుండి కనిపెట్టి చూచుచుండిన సీతా

రత్న మేమియు నెరుగనిదానిలాగున మొగము ప్రక్కకు త్రిప్పుకొని సిగ్గుపడుటకు మారు ఆనందించసాగినది. మునతి వాని మాటలలోని గూఢాభిప్రాయము గ్రహించి యుండును. కన్యకదా!

హెచ్చరికలతో, నమస్కారములతో, వీడికోలు జరిగినది. మోటారు పరుగిడి పోయినది.

కొన్నిరోజులు గడచిపోయినతరువాత బూసిగా డొక రోజున మాటలసందర్భమున గోపాలముతో నప్పటికి మూడు రోజులక్రిత మేకాక్షి నా ప్రాంతములో చూచినటుల చెప్పినాడు.

గోపాలకృష్ణుడు "ఏమి! ఇంతవరకేల చెప్పితివికాదు? ఎక్కడ కనుపించినాడు?" అని యడిగినాడు.

బూసిగాడు దూరమున నున్న రొయిక చెట్లగుబురు వైపు ర్థము లేకుండ చేయి యూపి "వా డీ వైపునకు రాలేదు." అని సమాధానము చెప్పినాడు. అంతకన్న వేరేమియు చెప్పలేదు. కృష్ణు డంతకన్న వేరేమియు నడుగలేదు.

అతడు రామచంద్రముతో "ఇది బాగుగ లేదు. వాడీ ప్రాంతములలో తిరుగుట మనకంత మంచిదికాదు" అన్నాడు.

రామచంద్రము తాజుగా "వాడు మనకేహాని చేయగలడు. దొరికిన మరియొకసారి కొరడాదెబ్బలు తినుట యెవనికి నంత సరదాగా నుండదుకదా!" అని సమాధానము చెప్పినాడు.

ధనరాజు సగర్వముగా ముందునకు వచ్చి "కృష్ణా! వాని విషయముయి మన మంతగా తంటాలు పడనక్కరలేదు. వాడుమరియొకసారి మనయింటికి విందునకువచ్చునా? ఉహూఁ. మన బూసిగాడు బహుశా యేకాక్షి దెబ్బలుతిని పోకపూర్వ ము చూచియుండును. ప్రాతకథయే. అయినను, యెందుకయి న మంచిది. మన పనివాండ్రతో కొంచెము కన్ను తెరచి యుండుమని చెప్పుదును." అన్నాడు.

అతడు బద్ధకముగా కాళ్ళు చేతులు చాపి విరుచు కొని, ప్రక్కను [illegible] యొక పొడుగయిన కొర డాతీసి రెండు మూడు సారులు గాలిలో విసరి చళేలు చళేలు మని పేల్చి "వాడు నా కంటబడిన నీ రీతిగా సత్కరింతును. మనము రేపు పశువులను విడకొట్టవలయును. ఊస్పు ప్రదేశము లనుండి మేతకువచ్చిన పశువులు యెవరివి వారు త్వరలో తీసి కొనిపోవుదురుకదా! కృష్ణుడును, రాముడును యొకప్రక్కగా నుందురు. నేనును మిగతవారును మిగతవైపుల నుందుము." అన్నాడు. అందరామోదించినారు. ఆరాత్రి భోజనములు పూర్తియయిన తరువాత నందరును కులాసగా విశ్రమించి నారు.

రాత్రి నిర్మలముగా గడచిపోయినది. తగినంత పెందల కడలేచి, కాలకృత్యములు ముగించుకొని కడుపుల పని పూర్తి చేసి యందరును పని ప్రారంభించినారు.

అందరు చాలవరకు శ్రమపడి పశువుల మందల చాలవరకు విడకొట్టిన తరువాత విశ్రాంతి తీసికొని భోజనములు చేసి మరల పనికి ప్రారంభించినారు. పైనుండి వచ్చిన పశువులను విడకొట్టుట జరిగిన తరువాత వారు వారి సొంతపశువులను కూడ రెండు మూడు భాగములగా విడకొట్టవలసి యున్నది. అటుల చేయుటలో రెండు సంవత్సరములు దాటిన కోడిదూడలను యెడ్లతో కలుపుటకు వానిని వేరుచేయవలయును. ఆపనికి ప్రారంభించినప్పు డదివరకుకన్న నెక్కువ గందరగోళమును కంగారును బయలుదేరినవి. తల్లులనుండి పిల్లలును విడతీయుట చాలకష్టము. ప్రతి యావును దూడను విడిచి వేరుగ పోవుట కిష్టపడక చాల పెంకితనము చేసి తిరుగబాటు కూడ చేసినది. వారు చాలవరకు శ్రమపడి యన్నిటిని విడకొట్టి, ఆవులనన్నిటిని పనివాండ్రు స్వాధీనముచేసి వానిని దూరముగా తోలుకొని పొమ్మని చెప్పి రామచంద్రమును గోపాలమును దూడల నొక చిన్న దొడ్డిలోనికి తోలుకొని పోవునంతలో నొకపడమటావు దూడను విడిచి పెట్టలేక పనివాండ్రను మోసగించి మందనుండి తప్పించుకొని యెదురుగనున్న రాముని మీదకు విడివడిన బాణము లాగున రుయ్యిమని పరుగిడ సాగినది.

“రామం! రామం! వెనుక! వచ్చె! వచ్చె! తప్పుకో!” అను కేకలు వినుపించినవి.

పొడుగుగానున్న కొమ్ములు నలుప్రక్కల గాలిలో

విసరుచు, నది రంకెలు వేయుచు రామచంద్రుని మీద పడినది కాని యత డతిలాఘవముగా చెంగున ప్రక్కకు గెంతి, దాని పోటు తప్పించుకొన గలిగినాడు. పోటు దాటినది. అది ముందు నకు తూలి ముందు కాళ్ళమీద బోర్ల పడినది.

ఒక్క క్షణములో దాని కొమ్ములు రాముని ప్రేగల లో దూరి యుండును కాని యంతలో కృష్ణు డతి లాఘవము గా ముందునకు వచ్చి చేతిలోని పొడుగుపాటి తాడు తెలివి తేటలుగా విసరుటచే నది యా యావు ముందుకాళ్లకు చుట్టు కొనినది. అది వీలు తప్పి వచ్చుటచే బోర్లపడి పోయినది. అంత లో రామచంద్రుడు తప్పించుకొని ప్రక్కకు పోవగలిగినాడు.

"కృష్ణా! మంచిపని. నీ కీ మాత్రము బదులు తీర్చి వేయుదునులే" అన్నాడు రామచంద్రుడు సంతోష పూర్వక ముగా.

"అంతవర కవసరముండదు" అని నవ్వుచు గోపాలుడు సమాధానము చెప్పినాడు.

ఒక వారము గడచినది. రామచంద్రుడును ధనరాజును గోపాలుని పట్టుమీద తుపాకి షికారునకు పోయినారు. వారు చాలాదూరము పోవలసి వచ్చుటచే గుఱ్ఱముల మీద పోయి నారు. అది కొండ ప్రదేశమగుటచేత వారంత మంచి గుఱ్ఱము లను-స్వారికి పనికివచ్చు వాటిని-జాగ్రత్తపరచి యుంచలేదు. అదికాక, మంచిగుఱ్ఱములను జాగ్రత్తపరచి యుంచుకొన వలసి

నంతటి యగత్యమును లేదు వారికి. వారు సామాన్యపు గుర్ర ముల నెక్కియే పోయినారు. అవి వేటకు పనికిరాక పోయినను మోతకు పనికివచ్చినవి. వారు నాడు యుదయము మొదలు కొని మధ్యాహ్నము రెండుగంటల వరకును తిరిగిరి గాని చెప్ప తగినంత వేట జరుగకపోవుటచేత విసుపుచెంది యప్పటికి భోజనము వేళకూడ దాటిపోవుటచేత నొక చల్లని చెట్టునీడను విశ్ర మింపదలచి గుర్రములను విశ్రాంతి కోసము మేతకోసము ప్ర క్కను విడచి పుచ్చినారు. అవి యటు నిటు తిరిగి క్రమముగా వారికి చాటుగనున్న ప్రదేశమునకు పోయినవి. వారు దుస్తులు తొలగించుకొని యింటిదగ్గరనుంచి తీసికొనివచ్చిన తినుబండారములు వెలుపలకుతీసి హాయిగా భుజించి, తాబేటికాయలోని నీరు త్రాగి కడుపుబాధతీర్చుకొని మంచికబ్బలు చెప్పుకొనుచు కులాసగా కునికిపాట్లకు దిగినారు. సుమారొక గంటకాలము విశ్రమించి, ముగ్గురును ముందుకార్యమునకు సిద్ధపడినారు. ధనరాజు దుస్తులు ధరించుకొని చాటున నయినను చేరువనే మేయుచున్న గుర్రములను తీసికొని వచ్చినాడు.

ధనరాజును రామచంద్రుమును యింటికిపోవలెనని యభిప్రాయమొసంగిరి. కాని గోపాలకృష్ణుడు మరికొంచెము సేపు వేటకానిచ్చి, యేపండినైన కొట్టువరకు నింటికి పోకూడదని పట్టుపట్టినాడు. మిగతవారు చెప్పినత్రోవకు కుర్రవాడు రానందున కుర్రవాడు చెప్పినత్రోవకే మిగతవారు రావలసివచ్చినది.

వారు పందిని వెతకుటకై ముగ్గురు మూడుత్రోవల పోవలయు నని యేర్పడినది. కాని చిన్నవాడయిన కృష్ణుని నొంటరిగా పంపుటకు ధనరాజునకు మనస్సొప్ప నందున రామచంద్రుని, గోపాలమును కలసిపంపి యతడొక్కడు వేరుత్రోవను బయలుదేరినాడు. వారువిడిపోయి సుమారు పదిహేనునిమిషములు కాలేదు. గోపాలుని గుఱ్ఱమును చూచి, రామచంద్రము "కృష్ణా! నీ గుఱ్ఱము సరిగాలేదు. తొందరగా పోనీయకుము. జాగ్రత్త!" అని హెచ్చరించినాడు.

"ఆ! ఎందుకుండదు? బద్ధకము బలిసినది" అనుచు కృష్ణుడు దాని నొకదెబ్బ కొట్టినాడు.

"ఆ! ఆ! కొట్టకు; కొట్టకు; జాగ్రత్తసుమా. కళ్లెము బిగపట్టు. రికాబులు సరిగానున్నవా!" అని రామచంద్రము మరి మరి హెచ్చరించసాగినాడు. కాని యేమిలాభము.

"ఆ. అలాగే. జాగ్రత్తగనే యుందును" అని కృష్ణుడు చెప్పనంతలో గుఱ్ఱము చెంగున ముందునకు దుమికి మతిలేని దానిలాగున పరుగిడసాగినది.

రామచంద్రునకు సంగతి బోధపడలేదు. అతడు కంగారుపడి ముందుపోవుచున్న గుఱ్ఱము స్వాధీనము తప్పినదని గురుతించి, ఆపుమని కృష్ణుని కేకవేయుచు, వానినికలసికొనుటకై తనగుఱ్ఱమును తొందరచేసినాడు. మతిలేక ప్రాణభయము వీడి పరుగిడు గుఱ్ఱముతో సమముగా మంచి స్థితిలోనున్న

గుర్రము పరుగెత్తగలదా! అయినను రామచంద్రుని తొందర గ్రహించి వాని గుర్రముకూడ ప్రాణములకు తెగించియే పోవుచున్నది.

ఆలాగున ముందుపోవుచున్న గుర్రము నాపుటకు కృష్ణు డన్ని విధముల ప్రయత్నించినాడు. బుజ్జగించినాడు. బ్రతిమాలి నాడు. బెదరించినాడు. మాటదక్కినదికాదు. అంతలో చేరువ నెవ్వరో తుపాకి పేల్చినారు. ఆధ్వనిచే కృష్ణుని గుర్రమునకు శరీరము జల్లుమన్నది. అది వెర్రియెత్తిన దానిలాగున చెంగున ముందునకు గెంతి పిరంగిగుండువలె ముందునకు పరుగిడసాగినది. దానికి ముందుచూపే గాని వెనుకచూపు లేదు.

కృష్ణుడు గుర్రముకళ్లెము రెండుచేతుల బిగలాగిపట్టినాడు. కాని ప్రయోజనము లేకపోయినది. గుర్రి మాగలేదు. ఆగున టుల కనుపించలేదు. దానికి మతిపోయినది. దానిగ్రుడ్లు ప్రజ్వ రిల్లినవి నోట నురుగు కారజొచ్చినది. అది నాలుగు కాళ్లు సాచి వేయుచు మేఘములలో పోవుచున్నటుల కనుపించినది.

అతడు కళ్లెము మరియు బిగలాగినాడు. కుడివైపున నున్న కళ్ళెపుతోలు పటపట లాడినది. అది యప్పటి కప్పుడే చాలవరకు తెగిపోయినది. కృష్ణుడు మాటదక్కదని జడిసి రెం డుకళ్ళెము లొకచేతితో బిగపట్టి రెండవ చేతితో జీను గట్టిగా పట్టుకున్నాడు. వాని నంతవరకు కనిపెట్టుకొనియున్న ధైర్యమ ప్పుడు వానిని చాలవరకు విడచి పోయినది. కంగారు పుట్టినది.

అత డప్పుడు చేయవలసిన దేదియు లేదు. వెనుక రామచం ద్రుని చూచుటకైనను సావకాశములేని స్థితి. వాని మాటలు వీని చెవిని పడుటలేదు. వాని యునికియే వీనికి సందేహముగా నున్నది. అంతలో గోయిచుట్టుమీద రోకటిపోటులాగున కుడి వైపుకళ్లెము తెగి జారిపోయినది. వాని ధైర్యముచచ్చినది. ఉన్న కొంచె మాధారమును పోయినది. మొండితనమే మిగిలిన యాధారమిక. నీటమునిగి చచ్చువాడు గడ్డిపరకకూడ యాధారమగునని భ్రమపడునటుల నతడు కళ్ళెము విడచి రెండుచేతుల తోను జీను గట్టిగాబిగపట్టి, దానినే కౌగలించుకొని, రికాబులు బెనగకుండ తన్నిపెట్టి, కండ్లుమూసికొని, భారమంతయుభగవంతునిమీద పడవేసి కూరుచున్నాడు.

గుర్రము తిన్నగా నింటిముఖము పెట్టినది. అదియు కొంత నదృష్టమే అప్పటికి చాలదూరము గడచినది. ఇల్లు చాలవరకు సమీపించినది. గుర్రమునకు పూర్తిగా మతిపోయినది. స్మృతి తగ్గినది. గమనము చచ్చినది. అది చచ్చువరుగున పోవుచు నొకచోట నాకస్మికముగా దబేలున నాలుగు కాళ్ళమీదను ముందునకుజోర్ల పడినది. దాని మీదనున్న కృష్ణుడు విసరి పారవేసినటుల ముందు, యే పది పండ్రెండు యడుగుల దూరముననో పడియుండును. నడుమో, మెడయో పటుక్కున విరిగి యుండును. తలయైనను చెక్కలయి యుండును. కాని గమన మప్పటి కప్పుడే చాలవరకు మందగించి యుండుటచేత

ను, కృష్ణుడు రాగల సంగతి ముందుగనే గ్రహించి యుండుట
చేతను, వానికంత యవసరపట్టలేదు. గుర్రము పడునని యతడు
రికాబులలోని కాళ్లు రెండును మీదకెత్తి, తూలిపడిపోకుండ
రెండుచేతులతోను జీను గట్టిగా బిగపట్టి కూరుచున్నాడు.
గుర్రము ముందు పడినది. అతడు దానిమీద పడి పట్టువీడి
కొంచెము దగ్గరగనే పడినాడు. స్మృతి తప్పిపోయినది.

అంతలో రామచంద్ర మక్కడ చేరి గుర్రముమీద
నుండి చటుకున క్రిందకు దిగి పగర్చుచున్న గుర్రమువైపు
చూడనయిన చూడక, క్రింద మొద్దులాగున పడియున్న
కృష్ణుని దగ్గరచేరి, వానిచంకలలో చేతులు వేసి, లేవనెత్తి,
ముక్కును, గుండెలును పరిశీలన చేయసాగినాడు.

అదృష్టవశమున నాప్రదేశము వారి యింటికి చాల చేరు
వయే. ఆ ప్రాంతములు పనిచేయుచున్న యొక రిద్దరు పనివాం
డ్రాసంగతి గ్రహించి, యక్కడకు తొందరగావచ్చి చిన్నవా
నిని సేదదేర్చుటకయి నీళ్లు ముఖముమీద చల్లి వానిని జాగ్ర
త్తగా చేతులమీద నిల్లు జేర్చినారు.

అంతలో ధనరాజు కూడ నింటికి వచ్చి రేడ్డివగయిరా
లు చేసిన సమావేశము పూర్తిగావించినాడు. సంగతి వానికి
వెల్లడియాయినంతనే నతడు బూసిగానిని తీసికొని తిన్నగా గు
ర్రము పడియున్నచోటకు పోయినాడు. అక్కడ చచ్చినటుల
మొద్దులాగున పడియున్న దానిని పరిశీలించి బూసిగాడా

చుట్టుప్రక్కల తిరిగి డొంకలమీద పెరిగియున్న యొక రకపు తీగాకులు తెచ్చి దానిరస మాగు(్రము ముక్కులలో పిండినాడు. దానివలన ప్రయోజనము కనుపించనందున మరి యొక సారి పిండినాడు. అంత నా గుర్రము టకు టకు దొర్లి, కాళ్లు కూడదీసి కొని తల యెత్తినది. జీవి తాశ కలిగినది.

ఇక దాని ప్రాణమునకు ప్రమాద మెంతమాత్రమును లేదని గ్రహించి, ధనరాజు బూసిగాని నక్కడ కాపుంచి, తానుమాత్రము తిరిగి యింటికి పోయినాడు అక్కడిసంగతి చూచుటకు.

అప్పటికి గోపాలకృష్ణుడు చాలవరకు గ్రోనలో పడి నాడు. స్మృతి కలిగినది. లేచి పడకకుర్చీలో కూరుచున్నాడు. అదృష్టవశమున నెముకలు వగయిరా విరుగలేదు. అతుకులు వసలలేదు. గట్టిదెబ్బతగిలి తల దిమ్మెక్కినది. అది యిప్పటికి చాలవరకు సరుదుకున్నది.

ధనరాజు వాని దగ్గరచేరి సంగతేమని యడిగి మధ్యాహ్నము భోజనానంతరము వారందరు వేటకు విడిపోయిన తరువాత గుర్రము దానంతటది వెర్రియెత్తి పరుగిడినదని తెలిసి కొని, రామచంద్రునివలనకూడ నాసంగతియే ధృవపరచుకొని కృష్ణుని గుర్రి మొకరకపు విషపుజాతితీగ తినుటచే దాని మతి చలించినదనియును, అది మరల కొన్ని వారముల వరకు నసలు

స్థితికి రాదనియును చెప్పినాడు. వారంద రాశ్చర్యమును వెలి బుచ్చినారు.

"ఇట్టినంగ తిదివర కెన్నడును తటస్థించలేదు" అన్నాడు రామచంద్రము.

"ఆ తీగ యీప్రాంతములో బయలుదేర వసలు." అన్నాడు ధనరాజు.

"అయిన నిప్పు డెటుల వచ్చిన దిక్కడకు. ఈ యవస్థ యంతయు తీగతినుటచే కా దనుకొనియెదను" అన్నాడు, కృష్ణుడు.

"నేనును బూసిగాడును పోయి చూచివచ్చితిమికదా! దానినోటి చిలుమలలో నాతీగ తాలూకు చివపలు మిగిలియు న్నవింకను. దాని వాసనయు, దాని పనియు నాకు బాగుగా తెలియును. దానికి విరుగుడు కూడ మాకు తెలియును గనుక మేమా యాకుపసరు తీసి గుర్రము ముక్కులలో పిండితిమి. వెంటనే నది స్మృతికలిగి లేచినది. ఆ తీగ యీప్రాంతము లలో బయలుదేరక పోయినను, యెవరయిన నే యుద్దేశముతో నయిననేమి—కొంచెము తెచ్చియుండకూడదా? గుర్రమునకు పెట్టియుండ కూడదా? గుర్రము తిన్నది" అన్నాడు ధనరాజు.

అంతలో బూసిగా డక్కడకు పరుగెత్తుకొని వచ్చినాడు. వాని చేతిలో తెలిపోయిన గుర్రపుగల్లెపు ముక్కలున్నవి.

క్రొత్తసంగతి యేదియో వెలిబుచ్చులాగున నున్నది వాని ముఖము.

అతడు "మీ రిది చూచినారా?" అన్నాడు.

"అది నా గుర్రముది. గుర్రము నాపుటకు ప్రయత్నించినప్పుడు తెగిపోయినది. అందు విపరీతమేమున్నది?" అన్నాడు కృష్ణుడు.

"క్రొత్త కళ్లెము తెగవలసిన యగత్య మేమివచ్చినది? ఎంతబిగపట్టినను తెగకూడదు" అన్నాడు రామచంద్రము.

"అయ్యా! ఇది తానంత టది తెగ లేదు. తెగినచోట తోలు కొంతవరకు కత్తితో బలవంతముగా తెగగోసినటుల కనుపించుచున్నది. చూడుడు మీరందరు' అని బూసిగాడు వారికి కళ్లెము చూపినాడు.

అంద రాశ్చర్యముగా చూచినారు. నమ్మకము కలిగినది. సంగతి స్థిరపడినది. ఎవరో తుంటరులు దాని కా తీగ తెచ్చిపెట్టి యుందురు. మధ్యాహ్నము విశ్రాంతి సమయమున గుర్రములు చాటునకుపోయినప్పు డావని జరిగియుండునని నిశ్చయించినారు. గుర్రమునకు విమవృతీగ పెట్టుటయు, కళ్లెమునగముపైగా తెగకోసి యుంచుటయు నెవరిపనియై యుండునని వారు తటపటాయించినారు. అంతలో కృష్ణుడు, గుర్రము వెఱ్ఱియెత్తి పరుగిడినప్పుడు తుపాకి చప్పుడు వినపించినదని చెప్పి యా యనుమానమును ధృవపరచినాడు.

"అవును కాని యింతవరకు చేయవలసిన యగత్య మెవరికుండును?" అన్నాడు రెడ్డి.

"బహుశా యేకాక్షిగాడయి యుండును. అంతకన్న యెవరున్నారు మన కొంపలికక్కడ" అన్నాడు రామచంద్రము.

"అవును. అత డొకటి రెండు రోజుల క్రిందట నీ ప్రాంతములలో కనుపించినాడని బూసిగా డిదివరకే చెప్పినాడు మనకు. మనము లక్ష్యపెట్టినాము కాము కాని" అన్నాడు ధనరాజు. అందరును తీవ్రముగా లేచినా రా సంగతివిని.

ఏమి జరిగిననేమి, వా డీ సరికి చాల దూరము పోయి యుండును.

రాత్రి భోజనముల తరువాత నెవరిగదికి వారు పోవునంతలో రెడ్డి కుమారుని పిలిచి "నాయనా! ఈ పిస్తోలు నిత్యము నీ దగ్గర నుంచుకొనుము. సరుకుతో నిండియుండిన మంచిది—చాల జాగ్రత్తసుమా! అనవసరముగా నుపయోగించకుము. నీవు దుడుకువాడవు. అంతగా నవసరముండదు కాని యెందుకయినను మంచిది దగ్గరనుండిన. నేడు నీ విషయములో నంతతుంటరి తనము చూపినవాడు ముందు యేమిచేసినను చేయగలడు. ఏకాక్షిగాడు నీకు హాని కలుగజేసి, వానికి నామీదనున్న క్రోధము తీర్చుకొనదలచుకున్నాడు. అందుచేత నాయనా! మెలకువగా నుండుము" అన్నాడు.

"అలాగే. ఎందుకయినను మంచిదినాకు," అనుచు పిస్తోలు పట్టుకుని కృష్ణుడు పడకగదికి పోయినాడు.

◆ ◆ ◆

## ౪

ఒకటి రెండు రోజులు గడచిపోయినవి. ఒకనాటి సాయంత్రము వా రందరును వీధిగుమ్మముముందు కూర్చుని కులాసగా కబురులు చెప్పుకొనుచున్నారు. అప్పుడే సూర్యాస్తమయమగుచున్నది. వెలుతు రింకను పూర్తిగా తగ్గలేదు. అంతలో పశువుల కుర్రవాడొకడు వగర్చుచు వచ్చి "అయ్యా! పశువు లెప్పటి లాగున కలసి మందగా రాక చెదరి చెదరి వచ్చినవి. కొన్నిటికి గాయములుకూడ నున్నవి. రెండు పాడి యావులు విడిగా వచ్చినవి. వెంట దూడలు రాలేదు. ఒకగిత్తకు వెన్నున బలమైన కత్తిపోటు తగిలినది" అని చెప్పినాడు యేడ్పు మొగము వేసికొని.

అందరు కంగారుగా లేచి పశువులను చూడబోయినారు. పశువులన్నియు కంగారుగా మోరలెత్తుకొని వచ్చినవారిని వెకవెకచు చూడసాగినవి. నాలు గయిదు పశువులకు మంచి గాయములు కనుపించుచున్నవి. ఒక యావు మూపున తగిలిన గాయమునుండి జారిన రక్తముచే ప్రక్కంతయు తడిసి యెర్రగానున్నది. గిత్తకు తగిలినగాయము లోతుగను, పొడుగుగను ఉన్నది. అది పొడుగుగనుండు నొక వాడి యాయుధముచే కలిగియుండును.

ధనరాజు తీవ్రముగా "ఇ దెంతమాత్రము బాగున్నది

కాదు. ఎవడో ప్రత్యేకము పగ పట్టి చేయుచున్న తుంటరిపని కాని వేరుకాదు. క్రమముగా మితిమీరుచున్నది. లేగదూడ లు రాకపోయిన వన్న నేనక్కలో పట్టుకొన్నవనుకొనవచ్చు ను. కాని పెరిగిన గిత్త మాట? ఈ చేరువలో ఘాతుకమృగము లు లేవే యసలు! అదిగో! అ యావుకు తగిలిన దెబ్బ తూటూ లాగున కనుపించుచున్నది. గిత్తకు తగిలిన పొడుగయిన గాయ ము కతి పోటు" అని పండ్లు పట పట కొరకినాడు.

"ఏకాక్షిగాడు!" అని రామచంద్రి మాకస్మికముగా కేక వేసినాడు.

"అయియుండవచ్చు. నేను కాదనను. మన మీవిష యములో కొంచెము గట్టిగా పట్టుపట్టి చూడవలయును. పశు వులు మేతకు పోయివచ్చిన దిక్కునకు పోయి చూచివచ్చిన సంగతి బోధపడగలదు" అన్నాడు ధనరాజు.

"అ పెద్దకొమ్ములల యావు వెంట దూడరాలేదు. దాని రక్షణ కోసము ప్రయత్నించుటలోనే యావునకు గాయము తగిలియుండును. ఆవు కోసము తంటాలుపడి గిత్తదెబ్బతిన్నది. అంతేనా!" అన్నాడు కృష్ణుడు.

"సరిగా నంతే. నా దగ్గర పిస్తోలున్న వాని శరీరము తూటుపడులాగున కొట్టియుందును. గిత్తగాయమునకు త్వరగా మందువేసిన బాగుండును. గాని యది మనలను చూచి బెదరు చున్నది పాపము. పోనిండు, మందులేకపోయినను ప్రమాదము

లేదు. మిగతపశువులు నాకివేయుగలవు. అదే వాటికి మంచి మందు. అబ్బాయిలు! మీరందరు పెందలకడ పండుకొనుడు. చీకటితోనే-చీకటుండగనే లేచిపోవలయును. సూర్యోదయము కాక పూర్వమే మనము పొదుపుకొండ దాటవలయును. తెలిసినదా!" అన్నాడు ధనరాజు.

నా డాలాగుననే మరుసటి యుదయమున పెందలకడ లేచి కాలకృత్యములు తీర్చుకొని బయలుదేరి చాలదూరముపోయి నారు. అప్పటికి వెలుతురు బాగుగా వచ్చినది. వారందరొక యెత్తయిన కొండమీదకు పోయి, నర సంచారము గురుతించు టకు నలుదిశల చూచినారు. ఏమియు కనుపించలేదు. ఆ విధ ముగా నొక యరగంట పైగా గడచినది.

"ఆ! వా డంత తెలివితక్కువ సన్యాసికాదు. ఈ సరికి చాలదూరము దాటిపోయి యుండును" అన్నాడు ధనరాజు.

"ఆ! ఆ! అదిగో! దూరమున నా కాకులు చూడుడు. డొంకప్రక్కను నేలాగున చెదరి యెగిరినవో. అ వక్కడ నేమి చేయుచున్న వనియెదరు!" అని యడిగినాడు గోపాలము.

నుమా రొక యరమైలు దూరమున నొక డొంకప్రక్క ను కొన్ని కాకులు యెవరో బెదరించి నటుల నాకస్మికముగా పైకెగసి తిరిగి వాలినవి.

"అక్కడ మనుష్యులుండి యుండరు. ఉన్నచో నవి తిరిగి యక్కడ వాలవు. అయినను మనముపోయి చూచివచ్చె దము. ఏదిరాయి చచ్చి పడియుండు ననుకొనియెదను.కాకు లట్టివే

యానందముగా తినుకదా!" అన్నాడు రామచంద్రుడు.

వారు త్వరలోనే యక్కడకు పోయినారు. వారి రాక గమనించి యప్పటి కక్కడ చేరియున్న నక్కలు రెండు చెంత నున్న డొంకలలోనికి పోయినవి. కాకులు చెదరి ప్రక్కనున్న చిన్న చెట్లమీదకు చేరినవి. అక్కడ రెండు లేగదూడల కళే బరములు మాత్రము మిగిలి యున్నవి. ఒక ప్రక్కను కర్రలు కాలిన బూడిద యున్నది.

"మనము కొంచె మాలశ్యముగా వచ్చినాము" అనుచు ధనరాజు బూడిద దగ్గరకుపోయి చేయి పెట్టిచూచి "చల్లగాను న్నది. ఇది రాత్రికథ. సరే. మీరు కొంచెము పరిశీలించి చూడుడు. అసలు వారెందరో" అన్నాడు.

"ముగ్గురు. ఇదిగో! వారు కూరుచున్నచోట నానవాళ్లు చూడుడు" అన్నాడు గోపాలము.

"అవును. వారి దగ్గర రెండు తుపాకులుకూడ నున్నవి. ఈ ప్రక్క గడ్డిమీద చెట్టుకుచేర్చి, యాపించినారు. ఇవిగో మడిమల యానవాళ్లు; మనదగ్గర నాయుధము లేవియు లేవే యవసరమునకు" అన్నాడు రామచంద్రము.

"నా దగ్గర మంచి పిస్తోలున్నదొకటి" అని గోపాలము చూపించినాడు.

"సెహబాస్! ఇకనేమి! మనము చిక్కులో పడకుండ నుండవలయును. వాడీ చెంత నెందులోనయిన దాగొని యుండు ను. ఏమనియెదరు? రామచంద్రము! నీవు తొందరగా నింటికి

పోయి, అయ్యగారితో చెప్పు. మే మీ లోపున నీ చుట్టువ్రిక్కల వెదకుచుందుము. త్రోవ తెలియును కదా యింటికి. ఏమి?"

"ఆహా! తెలియకేమి?" అని తిరుగబోవుచు "మీరు తిరిగి నన్నెచ్చట కలిసికొనియెదరు?" అని యడిగినాడు.

"అదిగో! ఆ కొండ మొగలో కలిసికొనవచ్చును. ఒకవేళ సాయంత్రములోపున మన మొకరినొకరు కలిసికొన జాలనిపక్షమున రాత్రి యిల్లు చేరుదుము" అన్నాడు ధనరాజు.

"సరే. నేను త్వరలోనే తిరిగివచ్చెదను" అని తొందరగా బయలుదేరినాడు రాముడు.

అతడు డాపత్తును ననుమానించనైనలేదు. వారి ప్రతికక్షులా ప్రాంతముల నే మారుమూలనైన నక్కియుందురనుకొనుట కెంతమాత్రమును యవకాశము లేదు. వారు వానినే నిమిషమునయిన నాటంకపరచగలరని యతడనుమానించనైన లేదు.

ఆతుంటరి యేకాక్షి గోపాలకృష్ణుని ప్రాణములకు ప్రమాదము తెచ్చిపెట్ట ప్రయత్నించిన తరువాత నతడట్టి తుంటరులను మరికొందరను చేర్చి, రెడ్డిమీద కసితీర్చుకొనుటకై వాని పశువులను చంప ప్రారంభించి యుండునని యును, అట్టి దౌర్జన్యమున కా గుంపును పట్టుకొని తగురీతిని శిక్షించుటయో, లేక ముందిక నేహానియు కలుగచేయు నవకాశము లేకుండ వారి నా ప్రాంతములనుండి సాధ్యమయినంత దూరముగా తరి

మి వేయుటయో చేయవలయునని స్థిరపరచుకున్నాడు రెడ్డి.

రామచంద్రము చురుకుగా నడచిపోవుచు తనలో "ఈ సారి మామగారు వాని నంత తేలికగా విడిచిపెట్టుదు రనుకొనను. దొరకిన పక్షమున నేకాక్షియును, వాని యనుచరులును కారాగారము చూచితీరుదురు. ఆనందించి తీరుదురు. కాని యట్టి తుంటరులు దొరకుదురని నాకు నమ్మకము చాలదు" అనుకొన సాగినాడు.

అతడా లాగున పోవుచు మొదటవచ్చిన చుట్టుత్రోవ కన్న దగ్గర త్రోవను పోవుటలో చిన్నరాతిగుట్టలు కొన్ని యె క్కుచు దిగుచు పోవలసివచ్చినది. అతడు కష్టపడి యొక పెద్ద రాతిమీదనుండి జారి క్రిందకు దిగునంతలో మానవు డొక డా చాటునుండి యొక్కసారిగా వానియెదుటకు వచ్చి నిలచినాడు. వాని చేతిలోని తుపాకి కొన బెదరించుచు తల యాడించినది.

"ఓహో! రామచంద్రముగారా! దయచేసి యక్కడా గుడు. లేనియెడల తమ ముద్దులబుర్ర ఊడి క్రిందపడగలదు" అన్నాడు యేకాక్షి కులాసగాను.

రామచంద్రము నలుప్రక్కల చూచినాడు. ముఖము లకు ముసుగులు వేసికొనిన మరియిరువురు మానవులు వానికిచె రియొకప్రక్కను నిలచియున్నారు. ఒకని చేతిలో తుపాకి సిద్ధ ముగా నున్నది. రెండవవానిచేతిలో వాడియైన వెడల్పుగానున్న కొనగల బల్లెమున్నది. అది చూచి, గిత్తకు గాయము కలిగిం చిన దదియేనని రామచంద్రము గ్రహించగలిగినాడు.

ఏకాక్షి తీరుబడిగా "అబ్బాయి! తప్పించుకొని పారి పోవ ప్రయత్నించుటవలన ప్రయోజనములేదు. మే మంత తెలివితక్కువవారము కాకపోవుటచే నీయదృష్టము బాగున్నది. సంతోషించు. మరియొకరయిన, నీ సరికి నీలోనుంచి యొకటి రెండు తుపాకిగుండ్లు పంపియుందురు. మేముకనుక సరిపోయి నది" అన్నాడు.

ఇష్టము లేకపోయినను రామచంద్రము విధేయత కను పరచవలసి వచ్చినది. తిరుగుపాటువలన ప్రయోజనములేదు— ఎంతమాత్రము. తిరుగబడుట గాని, పారిపోవ ప్రయత్నించుట గాని కష్టము కోరి తెచ్చుకొనుట వంటిది.

రామచంద్రము సాధ్యమయినంత నిశ్చలత చిక్కపట్టి "దీనికి నిన్ను తరిమి తరిమి వేటాడుదురని నీకు తెలియునను కొనియెదన?" అన్నాడు రామచంద్రము.

"అట్టి పని నీతరముకాదు. నీతాత తరముకాదు. నీవు మాత్రము నీ బ్రతుకు గురు తెరిగి, అనవసరముగా మాటలా డక నోరు మూసికొని యూరుకొనుము" అని ఏకాక్షి కండ్లెర్ర చేసి "ఇదిగో! జోగులూ! నీ వీ లోపున నది తీసికొనిపోయి, నేను చెప్పినటుల చేసి రా" అన్నాడు.

ముసుగులు వేసికొనియున్న నిరువురలో నొకడు చెప్పి నటుల చేయుటకై పరుగిడిపోయి రాళ్ళచాటున నదృశ్యమయి నాడు.

"నీవు మొదట కనుపించినప్పుడే నేను వ్రాయించినచీటి

కొయొకటి మీ మామదగ్గరకు ప్రయాణమై పోవుచున్నది వాని వెంట. అతఁడు మాకు కొంచెము డబ్బీయవలసి యున్నది— నిన్ను తిరిగిచూచుటకు—అనగా ప్రాణములతో నన్నమాట. మేము కూడ నంత యెక్కువగా నీయవలసినదని యడుగుట లేదు వానిని. ఒకనూరు రూపాయలు. అతడవి మేము చెప్పిన చోట పెట్టి, పోకపోయినయెడల మేము వానికి తరుచాత పంపు నది నీ రెండుచెవులును. తెలిసినదా? ఆ తరువాత సంగతి చూడ వచ్చును. ఏమనియెదవు?" అన్నాడు.

రామచంద్రము వణకినాడు. ఏకాక్షి అన్నప్రకార మాచరణలో పెట్టును. ఆ రకమే యొండిపీనుగు. ప్రక్కను నిలు చున్న రెండవవాడు ముసుగువారనుంచి చూచి ముసిముసి నవ్వు నవ్వినాడు.

అతడు తాజాగా "ఆ! అంతకఠినప్రయత్న మవసరముం డదు. ప్రియమైన మేనల్లుడు తరువాత జీవితకాల మంతయు లక్క చెవులతో సంచరించుట వాని మామకంత యిష్టముండ దు. అతడు తప్పక యిచ్చును. అబ్బాయి! అంతేకాదు!" అని కులాసగా నవ్వినాడు.

ఏకాక్షి "అబ్బాయి! నీ వంతగా భయపడనక్కరలేదు. మా పోములన్నవి వేళాకోళపుమాటలులే. ఇక ముందునకు నడు. లేనిపోనివేషములు వేయకు తప్పించుకొనుటకు నాతువాకి మంచిదికాదు. తెలిసినదా!" అని హెచ్చరించినాడు.

అతడు రామచంద్రుని భుజముపట్టుకొని యాకటకు

రాళ్లలో బలవంతముగా ముందునకు నడిపించసాగినాడు. రామచంద్రము నేలమీద గీతలుపడునటుల బలవంతముగా కాళ్ళీడ్చుచు నడువసాగినాడు. తరువాత వెతకుచు వచ్చు బూసిగానికి సులువుగా గురుతులు దొరకునని వాని యభిప్రాయము. ఏకాక్షి యాసంగతి కనిపెట్టి పండ్లుకొరికి పెద్ద కేక వేసినాడు.

"నీ వొక్కడవే యెంత తెలివైనవాడవని యనుకొనుచున్నావు కాబోలును. నీకోసమా కోయముండకొడుకు వచ్చునని భ్రమయా? పాప మట్టిదేదియు జరుగదు. అట్టి ప్రయత్నమేదయిన జరిగిన మరుక్షణముననే నీ చెవులు రెండును నీమామచేతులలో నుండునని కచ్చితముగా వ్రాసి పంపినాను. తెలిసినదా? అబ్బాయి! సరే నీచిత్తమువచ్చిన యానవాళ్ళు చేసికొనవచ్చును" అన్నాడు చాలవేళాకోళముగా.

లోపలనున్న భయము బయటపడకుండ కప్పివుచ్చుకొని కొంత ధైర్యము నటించుచు రామచంద్రము తాజాగా "అట్టిపని చేసితివా, యేమయిననుసరే, మా మామ నీ రక్తము కంటచూచువరకును నిదురపోవడని మాత్రము జ్ఞాపకముంచుకొనుము" అన్నాడు.

బూసిగా డెంత చమత్కారముగా గురుతులు తీయగలిగినప్పటికిని తుదమొదలులేని యా కొండప్రదేశములలో యేకాక్షి వాని సహాధ్యాయుల్తో తప్పించుకొని పారిపోవుట చాల సుకరమని రామచంద్ర మెరుగును. అదికాక బూసిగాడు కేవలము పిరికివాడు. ఎదుటివారి దగర తనశరీరము తూటు

గొట్టె యాయుధ మొకటి యున్నదని తెలిసిన నిక చెప్పనక్క రనే లేదు. గురుతులు కనుపించుటలేదని బండకెత్తి సాధ్యము యినంత త్వరలో వెనుకకు తిరిగి యి.టికి పోవప్రయత్నించును.

వారు కొంతదూరము నడచిపోయి చాటుగనున్న నొక సమప్రదేశము ప్రవేశించినారు. ప్రతికక్షుల తాత్కాలికవు మకామది యని రామచంద్రుడు గ్రహించినాడు. ఏకాక్షి బలమైన తాడొకటి తీసికొనివచ్చి రామచంద్రుని రెండుచేతులు వెనుకకు విరిచికట్టినాడు. తరువాత వానిని చేరువనున్న యొక చెట్టునకు బిగతీసి కట్టినాడు.

అతడు పండ్లికిలించుచు "అదీసంగతి. ఏర్పాటులన్నియు జరిగినవి. నీ విషయమంత తొందరలేదు. నీవు విడిపించుకొనగలిగినను దూరముగా పోజాలవు. తుపాకిగుండు వెంటనే పట్టుకొనును అక్కడనే కూర్చుని కులాసగా కాలక్షేపణచేయుము. సోములు! నీ వీ చెట్టుచివరకుపోయి వీనితాలూకు యెవరయిన నిటు వచ్చుచున్నారేమొ చూడు" అన్నాడు.

సోములు చురుకుగా చెట్టుమీదకుపోయి, పైకొమ్మ మీద కూరుచున్నాడు. వేరు పనిలేనందున రామచంద్రమునకు త్వరలోనే నిదురపట్టినది. అతడేమియు చేయచాలడు. సహాయార్థము స్నేహితులు వచ్చెదరన్న యాశమాత్ర మొకటి మిగిలియున్నది వానికి.

  

౫

మధ్యాహ్నము ప్రొద్దు తిరిగిపోయిన తరువాత బూసి గాడు కడుపునిండ భోజనముచేసి మంచిచుట్ట వెలిగించి చేరువ నున్న పొదలచాటున నిదురపో వెళ్లినాడు. అదియే వాని విశ్రామాగారము.

అతడు మలుపుతిరిగి కత్తిపోటు తిన్నవానిలాగున నాక స్మికముగా నాగినాడు. వానియెదుట కండ్లుమాత్రము కనుపించులాగున ముఖమున కేరినిని గుడ్డకట్టుకొనిన గంభీరాకారము గల మానవుడొకడు నిలచి యున్నాడు. అతడొక చేతిలోని పిస్తోలుతో గడగడ వణకు బూసిగానిని బెదరించుచు, రెండవ చేతితో వాని భుజము పట్టుకొని గుంజినాడు.

"ఏయి! నీవు నాయరు నెరుగుదువుకాదూ? ఇంటిలో వంటకువచ్చినవాడు" అని గద్దించినాడు.

ఇంటి యజమానికిని మిగతవారికిని వంటనిమిత్తము దరిమిలా నక్కడకు వచ్చిన మళయాళదేశస్థుడు నాయరను నతడు. అత డెన్నడును వెలుపలకు రాకుండ నిత్యము లోపలనే కాలక్షేపణ చేయుచుండును. ఎవరితోడను మాటలాడడు.

పొట్టకు తగులుచున్న తుపాకిగొట్టము కొన తలచుకొని గడగడ వణకుచు "ఆ! ఆ! ఎరుగుదును. ఎరుగుదును" అన్నాడు.

ఆ వచ్చినవాఁడొక మాసిన కాగితపుముక్క వెలుప లకుతీసి బూసిగానిచేతి కందించుచు "ఇది తీసికొనిపోయి వాని కిమ్ము. అది మీయజమాని, రెడ్డి కందచేయుమనుము. నీవు త్వరగా తిరిగిరా! మంచిచుట్ట యిచ్చెదను. మరి మాటలాడకు" అన్నాఁడు.

"చిత్తము. అట్లేకన్నా!" అనుచు చీటిపుచ్చుకొని 'బ్రతుకు జీవుడా!' అని యింటివైపు పరుగు ప్రారంభించినాడు.

మరి రెండు నిమిషములలో వాడు పరుగున తిరిగివచ్చి నాడు. భ్రమపెట్టిన చుట్టకోసము. కాని పాపము. అక్కడ నెవరును కనుపించలేదు. వచ్చినవాడు మాయమైనాడు. కాని బూసిగాడు తన కోసము కనిపెట్టుకొనియున్న నిద్ర నావ్వా నించి చల్లనిచోట హాయిగా నిదురపోయినాడు. ఈ సంగతే దియూ వాని బుర్రలో లేదసలు.

మరికొంచెము సేపటిలో రెడ్డి లోపలకు వచ్చినతత్క్ష ణము వంటవాడు చీటి వానిముందు పెట్టి "బూసిగాడు తెచ్చి నాడు" అని చెప్పినాడు.

రెడ్డి యది పుచ్చుకొని యిటు నటు త్రిప్పి, చూచి మడత విప్పినాడు. చేతిగాసి యక్షరములతో నందీలాగున నున్నది.

"మీ రామచంద్రము మా చేతులలో చిక్కినాడు. మీరు వానిని తిరిగి చూడదలచుకొనిన మాకొక నూరు రూ

పాయి తీయవలయును. ఈ రాత్రి సూదికొండ మొనదగ్గర నున్న రెయింటితాడి తొర్రలో పెట్టవలయు నా సొమ్ము. ఎవరును కనిపెట్టి చూడకూడదు. ఈ వర్తమానము తెచ్చిన వానిని పట్టుకొన ప్రయత్నించినచో రామచంద్రుని చెవులూడి పోవును. మమ్ములను కనిపెట్టదలచుకొనినను, అంతే! తరువాత నతడు మీకెన్నడును కనుపించడు. డబ్బు రాకపోయిన నెల్లుండి వాని చెవులు మీ కండచేయుదుము.

ఇట్లు,

ఆ మరణాంతము మీ ప్రతికక్షులు.

రెడ్డి తటపటాయించినాడు. ఇట్టి రకపుకథ లిదివరలో నక్కడక్కడ దూరదేశముల జరిగినటుల విన్నాడు కాని యతడు ప్రత్యక్షముగా నెరుగడు.

అతడు నెమ్మదిగా "ఏకాకీ యనుకొనిమెదను. ప్రస్తుతము నాదగ్గర డబ్బులేదు. ఉన్నను వారుచెప్పినటుల చేయకూడదు. సొమ్ము సంగ్రహించు నవకాశమున్నంత వరకును రామచంద్రుని చెవుల కేవిధమైన ప్రమాదమును లేదు. ఏదియేలాగున నున్నను తొందరగా పని ప్రారంభించుటయే మంచిది" అని యనుకున్నాడు.

అతడు లోపలకుపోయి యొక తుపాకియును, తూటాలును పుచ్చుకొని "సమయమున కింటిలో నెవరును లేకపోవుట దురదృష్టమే" అన్నాడు.

అతడు వెనుకవైపునకుపోయి పనివానిని పిలచి "నాకు నాయరిచ్చినా డిది చూడుము" అని చీటి వాని చేతికందించి, సంగతి చెప్పినాడు.

సవుక రది చదువుకొని "అయ్యా! మనమిప్పుడే వారి కోసము పోవుట మంచిది. ఇది దొంగవేషములాగున కనుపించుచున్నది. ఏకాక్షియును వాని వెంటనున్న కడుపు కక్కురితి ముండకొడుకులును, చేసిన పనియయి యుండును. త్వరగా బయలుదేరుట మంచిది. ఏయి బూసీ!" అని పిలచినాడు.

బూసిగాడు చెట్లచాటునుండి బలవంతముగమీాద వెలుపలకు వచ్చినాడు. చీటితెచ్చిన ముసుగువానిని చూచినప్పటి నుండియు వానికి మతిలేదు.

"బూసీ! నీకీ కాగిత మెవరిచ్చినారు?" అని రెడ్డి యడిగినాడు.

"ఆ వైపున వెళ్ళిపోయినవాడు" అని డొంకలవైపు చేయిచాపి చూపించినాడు.

"వా డేలాగున నున్నాడు?" అని మరల నడిగినాడు.

"లావుగ యెత్తుగ నున్నాడు. ముఖ మీాలాగున నున్నది" అని దగ్గరగానున్న మాసినగుడ్డతీసి కన్నులుతప్ప మిగత భాగమంతయు మూసికొని పోవులాగున ముఖము కప్పుకొని చూపించినాడు.

"ముసుగు వేసికొన్నాడు? అవును. నే నంతవర కను

హూనించినాను. సరే. మనము వానివెనుకనే తొందరగా యబ లుదేరి వానిని పట్టుకొనవలయును. బూసీ రా! త్వరగా ప్రయాణము కమ్ము" అన్నాడు

వారు త్వరలో బయలుదేరి బూసిగాడు తీసినత్రోవను పోవుచున్నారు.

అంతట వెంటనున్న పనివాడు "అయ్యా! మనము చేయుచున్న పని సరియయినదేనా? ఇంటిదగ్గర నాయుడు తప్ప నితరులెవ్వరును లేరు. ఆ తుంటరు లొకవేళ మనము వెళ్లినతరువాత నింటిమీదపడి యిల్లు దోచుకొనిన నాపువా రెవ్వరు?" అని యడిగినాడు ననుకుచు.

రెడ్డి తొందరగా "ఆ! అక్కడనే మున్నది వారి మొఖము? అయినవేవో తాళమువేసి యున్నవి. పప్పా, ఉప్పా నా? నడు నడు. చివరకంతయు మోసములాగున తేలగలదు. రామచంద్రము వారి కసలు దొరికి యుండడు" అన్నాడు.

"అది మోసమయిన వారి వెంటనున్న ధనరాజు, గోపాలమయినను యీసరి కింటికి రారా? ఇది మోసమయి యుండదు. వారు నిజముగా వానిని పట్టుకొనియే యుందురు. ఏమది బూసీ?" అన్నాడు.

అప్పటి కాగి క్రిందకు తొంగిచూచుచున్న బూసిగాడు "ఇద్దరు నడచినారు. ఒకడు వచ్చినాడు. ఇరువురు డొంకలో నుంచి వచ్చి వానిని కలసికొన్నారు. వారందరికైవైపుగా పోయినారు" అని చెప్పినాడు.

సంగతి మొదట బోధపడినది కాదు. కాని తరువాత రెడ్డిదగ్గర కుత్తరము తీసికొని వచ్చినవానికోస మిరువు రక్కడ కనిపెట్టుకొని యున్నట్టును, వాడు వచ్చి వారి నక్కడ కలసికో నినటును, తరువాత వాముగ్గురును కలసి రెడ్డి యింటివైపు పో యినట్టును బోధపరచుచున్నారు.

"సరే మన మిప్పు డేమి చేయవలసి యున్నది". అని యడిగినాడు నవుకరు.

రెడ్డి క్షణకాలము తటపటాయించి తొందరపడినందులకు పశ్చాత్తాపమును వెలిబుచ్చుచు వికారముగా మందహాసము చేసినాడు.

అతడు స్థిమితపడి "అబ్బాయి! నీవు చెప్పినది సరే. రామచంద్రముమీది యాగ్రహము గొలది నేను తొందరపడినాను. ఆ తుంటరులు మనల నింటిదగ్గర లేకుండచేసి యుల్లుదోచుకొనుటకే తలచి యుందురు. సరే. ఏమయిన నేమి? మనము తిరిగి త్వరలో నింటికి పోవుట మంచిది" అన్నాడు.

"చిత్తము నేను నదే యనుకున్నాను. మొదటినుండియు నా యనుమానమే యది. ఆ నరుకు సంగతి నాకు బాగుగా తెలియును గదా! బూసిగానిని ముందునకుపంపి, రామచంద్రు నెచ్చటనయిన కట్టిపెట్టి యుంచినారేమో, చూచిరమ్మనిన బాగుండు ననుకొనియెదను" అన్నాడు.

"ఆహా; అవును. బూసీ! నీవు పోయి రామచంద్రుని

జాడ చూచిరమ్మి. నీకు మంచి చుట్టలిచ్చెదను. త్వరగా పో”
అన్నాడు రెడ్డి.

“ఓ! వెళ్ళెదను” అని హెచ్చరికగా పరుగు ప్రారం
భించినాడు బూసిగాడు.

రెడ్డియు, వాని యనుచరుడును, వచ్చినత్రోవనే యిం
టికి మరలినారు. కాని యప్పటికప్పుడే చాలవర కలసిపోయిన
వారికాళ్లు వారికంత సానుభూతి చూపినవికావు. అది కాక
యప్పటికి చీకటి ప్రారంభించినందున వారు గోతులు, గలకలు
చూచి జాగ్రత్తగా నడవవలసి వచ్చినది. వారు యిల్లుచేరున
ప్పటికి పూర్తిగా చీకటి పడినది.

ఇల్లు చేరునప్పటి కింట నెక్కడను దీపము లేదు. వారు
లోపల ప్రవేశించునప్పటి కొకవిధమైన మూలుగు వినుపించి
నది. వారు తొందరగా నా దిక్కునకు పరుగిడి పంటగది తలుపు
తెరచి చూచినారు. ఏదియో నేలమీద పొరలు చున్నట్టుల
వారికి కనుపించినది. గురగుర శబ్దము వినుపించినది.

రెడ్డి, అగ్గిపుల్ల గీసి, లాంతరు వెలిగించినాడు. ఆ దొర్లు
చున్నది నాయరని దీపము వెలుతురున వారు గ్రహించినారు.
వాని కాళ్లు చేతులు బిగకట్టి యున్నవి. వాని తలమీదనుండి
గోనెసంచి యొకటి కట్టియున్నది. వారా సంచి తొలగించి
నోటకుక్కిన గుడ్డ లూడతీసి, కట్లు కోసివేసినారు. పాపము
నాయరు చచ్చుమొగము వేసికొని, యూపిరితీసికొనుచు మూ

టలాడ ప్రయత్నించినాడు. కాని యంతవరకు నోట గుడ్డలు కుక్కి యుండుటచేత మాట సరిగా వచ్చినదికాదు. ధ్వనిమాత్రము వినుపించినది.

ఒకరు చెప్ప నవసరము లేకపోయినది. వంటగదిలోని సామానుపెట్టె బ్రద్దలయియున్నవి. అందులోని యుప్పు, పప్పు వగయిరా సామాను కనుపించలేదు. బియ్యముపెట్టె కూడ కాళీగా నున్నది.

"నీవు చెప్పినది సరే. నేను తొందరపడి వెళ్ళినాను." అనుచు రెడ్డి తొందరగా యింటిలోనికి వెళ్ళి యన్నిగదులు చూచినాడు. దొంగలు చురుకుగనే పనిచేసినారు. చేతి కందినంతవరకు బట్టలు వగయిరా యన్నియు మాయము చేసినారు. ఇనుపపెట్టిమీద కూడ దౌర్జన్యము చూపినారు. కాని పాత్రదయినను యదృష్టము బాగుండుటచేతనో, వచ్చినవారి చేతగామిచేతనో, పెట్టిమాత్రము లొంగినదికాదు.

"మనము తినుబండారముల కొరకటి రెండు రోజులు యిబ్బంది పడవలసి వచ్చును" అన్నాడు.

రెడ్డి తొందరగా వంటగది దగ్గరకు పరుగెత్తి, వెనుక వైపునకు పోయి ధనరాజు భార్యను కేకవేసినాడు. సమాధానము రానందున దీపము తీసికొనిపోయి, చూచినాడు. ఆమెయు కట్లతో క్రిందపడి యున్నది. కట్లు విప్పి, నేదదేర్చిన తరువాత నామె సరుదుకొని "మీరు వెళ్ళినతరువాత నొక గంట

లోవచ్చి యుందురు ముగ్గురు. ఒకడు యేకాకీ. ముసుగువేసి కొన్నాడు. కాని మాటధ్వనిని పట్టి యానవాలు పట్టినాను. నాయరును యింటి చుట్టు తిరిమి పట్టుకున్నారు. తరువాత నా కోసము వచ్చినారు. నేను తిరుగబడి యొకనిని మొఖము మీద కొట్టినాను-పొయిలోని పుల్లతో. అంతకన్న నేమిచేయగలను? కాళ్ళుచేతులు కట్టివేసినారు" అని చెప్పినదామె దుఃఖపడుచు.

"విచారించకు. వాడు యేకాకీయే నని ప్రమాణము చేసి చెప్పగలవా నీవు? ఒక 'వారంటు'పుట్టించి వానినేలాగయి నను పట్టించవలయును" అన్నాడు రెడ్డి.

"అసలు యింటిదగ్గర మగవారెవరును లేనటుల వారి కేలాగున తెలిసినదా, అని. వారు కనిపెట్టి చూచుచున్నారా లేక చెప్పుట కెవరయిన దొరికినారా!" అన్నాడు నవుకరు.

"ఎవరు దొరకుదురు చెప్పుటకు? వారే కనిపెట్టి చూచుచుండ వలయును" అన్న దామె.

"సరే. ఏమయిననేమి. ప్రొద్దుటనే బయలుదేరి పోవల యును వారి కోసము. ఈ సారి పట్టుకొని దయదాక్షిణ్యము లెంతమాత్రమును చూపించకూడదు" అన్నాడు రెడ్డి.

"అలాగేనండి. కాని యాకాశమంతయు మేఘములతో నిండియున్నది, రాత్రి వర్షము వచ్చులాగున నున్నది. మనము పొద్దుట వారిని వెతకగలమా!" అన్నాడు నవుకరు సందే హించుచు.



# ౬

రామచంద్రమునకు త్వరలోనే మెలకువవచ్చినది. కాని బద్ధకముగా, బెంగగా బోర్లపరుండి కండ్లు మూసికొన్నాడు. అంతలో వాని కాళ్ళకును, చేతులకును వ్రేళ్ళు తగిలినటు లుండుటచేత వెనుకకు తిరిగి చూచినాడు.

ఏకాక్షియును సోములును వాని మీదకువంగి వాని కాళ్ళుచేతులకు మరియొక క్రొత్తతాడువేసి బిగతీసి కటుచు న్నారు.

ఏకాక్షి వికారముగా మందహాసము చేసి తాజాగా "మేము నిన్ను కొంచెముసేపొంటరిగా విడచి పోవలసియున్నది. నీ చెవులమీద కొంచెము డబ్బు వసూలుకావలయును మాకు. డబ్బు లభించకపోయినచో నీ రెండుచెవులును మీ మామకుపంపి 'తరువాత వచ్చునది ముక్కు' అని కబురుపంపుదుము. అప్పటికి నీ మీద నీ మామకున్న యభిమానము తేలగలదు. ఏమి?" అన్నాడు.

"నీ వంతవరకు సాహసించచాలవు. వారు మిమ్ములను పిచ్చికుక్కలను తరిమినటుల తరిమి తరిమి వేటాడుదురు." అని రామచంద్రుడు పెంకిసమాధానము చెప్పినాడు.

"సరే, కొంచె మోపికపట్టి చూచుచుండుము. నీకే తెలియగలదు. అంతవరకిక్కడనే యుందువుకదా! ఇక సెలవు మరి కొంతసేపటి వరకును" అన్నాడు.

ఏకాక్షి యొకసారి నలుప్రక్కల చూచి బయలుదేరి

నాడు. సోములు వెనుక కుణమూగి రామచంద్రునివైపు తిరిగి వేళాకోళముగా కన్నువిసరి, ముందువానివెంట బయలుదేరి నాడు. అది రామునకున్న కడుపుమంటను బలపరచినది.

రాముడు కట్లు విప్పుకొన ప్రయత్నించ ప్రారంభించి నాడు. అతడు ప్రయత్నించిన కొలదియును కట్లు బిగిసి చేతు లుకోసికొనిపోసాగినవి. కాని ప్రయోజనము లేకపోయినది. ఆ ప్రయత్నమువలన యాయాస మెక్కువయయి ముఖమునిండ చెమ్మటబొట్లు బయలుదేరినవి. ఇకనా ప్రయత్నము మాను కొని వెలుపలవారి సహాయము లభించునని యాశపడినాడు. ఏమిచేయగల డంతకన్న. కాని యంతవరకట్టి సందడేదియు వినుపించలేదు.

మరియొకగంట గడచునప్పటికి కట్టి యాశ నిరర్థకమని నిస్పృహకలిగినది. ఏకాకికిని, వాని యనుచరులకును యొందు లో తెలివితేటలు లేకపోయినను ముళ్లువేయుటలో మాత్రము మంచి తెలివితేటలున్నవి. రామచంద్రుని ప్రయత్నమువలన కట్లు మరింత బిగిసి చేతులు కోసికొని పోయినటుల నాతలుప డిమంటలు ప్రారంభించినవి.

అతడు నిర్మలముగా పరుండి సహాయ మెట్లు, యెప్పటి కేలా గున వచ్చునని లెక్కవేయ ప్రారంభించినాడు. అతడు వచ్చిన దద్దుతోవ యగుటచే ధనరాజును, గోపాలమును తిరిగి యిం టికి పోవునప్పుడయిన నా త్రోవను రారు కనుక వారి వలన ప్రయోజనము లేదు. వారు యింటికి పోయిన తరువాతగాని

తాను కనుపించని సంగతి బోధపడదు. వారు మిగతవారిని వెంటపెట్టుకొని వెతకికొనుచు వచ్చినను తెల్లవారిన తరువాత మాట.

ఈలోపున యేకాక్షి తిరిగివచ్చి నాడదివరకు బెదరించి నటుల చేసితీరును. పోవునప్పుడు సోములు విసరిన కంటికీసరు రామునకు కొంత యూశ కొలుపకపోలేదు. ఏకాక్షి యన్నంత పని జరుగదని భ్రమకలిగినది. అయినను యేకాక్షిని నమ్మ టకు వీలు లేదు. అతడు తిన్న కొరడాదెబ్బలకు ప్రతితీర్చుకొ నుటకై యెంతకయినను వెనకతీయు రకములో నివాడు కాడు.

సూర్యు డస్తమించుచున్నాడు. చీకటిపడినచో, నొక దిక్కుమాలినరాత్రి గడపవలసి వచ్చునని దిగులుగొని విచా రించుచున్న రామచంద్రుని చెవులకు మందమైన పదధ్వని విన వచ్చినది. అది యేకాక్షిదో వాని యనుచరులలోని మరియొ కనిదో! అయినను రామచంద్రున కానందమే కలిగినది. అత డా ధ్వని వచ్చినవైపున కాత్రముగా చూచినాడు. కొండలు ప్రతిధ్వనించునటుల పెద్ద యరచ పరచినాడు.

అది ప్రతిధ్వనించునటుల వినుపించినది. వెంటనే బూసి గాడక్కడ చేరి కట్లు తెగకోసినాడు. రామచంద్రుడు లేచి నిలువ ప్రయత్నించినాడు. వానికాళ్లు తిమ్మెరలెక్కినవి. రక్త ము తిరిగి సరిగా ప్రవహించువరకు నతడు లేచి నిలువచాలక పోయినాడు.

అతడు ఊపిరి యందుకొనుచు "నీ వేలాగున వచ్చినా

వు? అయ్యగారు వారిని పట్టుకున్నారా?" అని యాత్రిముగా నడిగినాడు.

"పట్టుకొనలేదు. మనము త్వరగా పోవలయు నిచ్చటినుండి. వారు రాగలరు. ఈలాగున రండు" అని బూసిగాడు తొందరచేసి రామచంద్రునకు చేయి యూనరాయిచ్చి నడిపించినాడు. చాల ప్రియత్న పూర్వకముగా కొంతదూరము నడచిన తరువాత తిమ్మిరులు సరుదుకొనినవి. కాళ్ళు స్వాధీనము యినవి. నడక తేలిక యయినది. సాగినది. వారు సురక్షితమైన ప్రదేశము చేరినటుల ధైర్యము గలిగిన తరువాత బూసిగాడు "మన మిక ముందునకు పోకూడదు. ఇంత చీకటిలో పోవుట మంచిదికాదు. కష్టము. వర్షముకూడ వచ్చులాగున నున్నది. ఇక్కడాగుదము." అని రామచంద్రము నాపి కొన్ని చితుకులు పోగుచేసి మంటచేసినాడు.

అంతలో తుంపర ప్రారంభమయినది. బూసిగానికి వర్షమనినయూనందము. దున్నపోతు జాతిలోనివాడు. చిందులు త్రొక్కుచు చుట్టుతిరిగి కోయవానిమాదిరి నృత్యముసేయ ప్రారంభించినాడు. వానికి వర్షములక్ష్యములేదు కాని, రామచంద్రున కటులకాదుకదా.

---

అతడు "బూసీ! వర్షములో తడియకూడదు. తలదా చుకొనుట కేదయిన నాధారముచూడుము. పిచ్చిముండకొడు కా! ఏ చెట్టుక్రిందకయిన పోవుదమురా!'' అని గసిరినాడు.

బూసిగాని కిష్టములేకపోయినను చెప్పినటుల చేయక తీరినదికాదు. అతడు నెమ్మదిగా నిటు నటు తిరిగి గుబురుగా నున్న నొక డొంకలో రాముని ప్రవేశపెట్టి, మరికొన్ని కొమ్మ లను, రొట్టయును తీసికొనివచ్చి దానిమీాద కప్పినాడు. అ దంత కట్టుదిట్టముగా లేకపోయినను కాలక్షేపణ కాటంక ములేకుండ నయినది.

బూసిగాడు దట్టమయిన దుప్పటి ముసుగుపెట్టి డొంక లో రామచంద్రునకు వేసిన మంటదగ్గరగాచేరి కూర్చున్నాడు. వారు కడుపున కేమియు లేకుండగనే యే దే నొకవిధముగా రాత్రి గడపివేసినారు. వెలుతురు కనుపించిన తోడనే లేచి తొందరగా బయలుదేరి యిల్లుచేరినారు.

వా రందరు నెవరి కష్టసుఖములు వారు వెళ్ళడిపరచుకొని నతరువాత యేకాక్షి వగయిరాలను వెతికి పట్టుకొనుటకై బయలుదేరినారు కాని ప్రయోజనము లేకపోయినది. గత రాత్రి పడిన వర్షముచే గురుతులన్నియు మాసిపోయినవి. వారి దుండగములు త్వరలోనే మరపునకువచ్చినవి. నిత్యకృ త్యములు నిర్మలముగ నడచిపోసాగినవి.

---

౭

కొంతకాలము నిర్మలముగ నడచిపోయిన తరువాత చేరు వనున్న గూడెముగ్రామములో జరుగనున్న పెద్దతీర్థము సమీపించినది. అక్కడకు ధనరాజును, గోపాలమును, రాముడును బయలుదేరి పోయినారు. తీర్థము చాల హెచ్చరికగనే జరిగినది. చుట్టుపక్కల గ్రామముల కది మధ్యయగుటచేతను, ఆ ప్రాంతములకది గొప్పతీర్థమగుటచేతను జనసమ్మర్థమునకు లోటులేదు. వినోదములకు వినువులేదు. వింతలకు వేడుకలకు విరామము లేదు.

వారు మూగ్గురా నాడు మధ్యాహ్నమంతయు చాల యుత్సాహముగా గడపి తిరిగి సాయంత్ర మగునప్పటికి వారు బసచేసిన మిత్రునియింటికి ప్రయాణమగునంతలో నిరువురుమానవులు-కోమట్లు అయియుందురు-మనుష్యులను గెంటుకొనుచు వెలుపలకువచ్చి, వారి సొంతబండి—చిన్న జట్కా—మీద ప్రయాణమయినారు. వారి వాలకములను బట్టియు వారి చర్యలనుబట్టియు ప్రజలకు వారిమీద యభిమానము తక్కువ యని తేలినది. కొందర కసహ్యము కూడను. ఏలనన వా రా ప్రాంతములకు పెద్దవడ్డీ వ్యాపారస్థులు. పెట్టుబడి దారులు. తద్వారా వారి పెద్దలును, వారును, పాడుచేసిన కొంపలు చాలగలవు. అదియె వారికిని ప్రజలకును గల పరస్పరసంబంధము. వారు పోవునపుడు గేలిసేసి కేకలువేసిన కుర్రవాండ్ర యానందమునకు మితిలేదు. మేరలేదు.

తీర్థపుజనము క్రమముగా పలచబడి పోయినది. రాము డును కృష్ణుడును బసపయివు పోవ ప్రయత్నించునంతలో రోడ్డు చివరనుండి పెద్ద కేకలును, అల్లరియును వినవచ్చినవి. వారా వైపునకు తిరిగి చూచినారు. నడువళ్ళి చాలని యిరువురు మను ష్యులను సుమారు పదిమంది మనుష్యులు జెబ్బలు పట్టుకొని తీసికొని వచ్చుచున్నారు. అంతకు స్వల్పకాలము క్రిందట బయలుదేరి పోయిన సాహుకారు బిడ్డలే వారు. వారిలో నొ కనికి నోట మాటవచ్చుటలేదు. రెండవ యాతడు పెద్దగొంతు కతో సంగతి చెప్పసాగినాడు.

"లావుగానున్న యెత్తయిన మనుష్యుడొకడు. ముఖ మున కొక గుడ్డకట్టుకొన్నాడు. దారికడ్డువచ్చి తుపాకితో బెద రించినాడు. బండిలోనుండి మమ్ము క్రిందకు దిగలాగి తుపాకి మ డిమతో నెత్తిమీద గట్టిగా కొట్టినాడు. మమ్ములను చాటున నున్న యొకచెట్టునకు రెక్కలు విరచికట్టి బండియెక్కి తోలు కొని పోయినాడు. అందుచాల సామాను, డబ్బు—ఎక్కడ బాబూ! పోలీసు" అని యరచినాడు.

ఆ ప్రాంతములోని పోలీసుజవానొక్క నిమిషములో నక్కడకువచ్చినాడు. కోమటి బిడ్డలు కథయంతయు మరియొక సారి చెప్పినారు వానికి. వారాలాగున చెట్లతో సుమా రొక యరగంట దెబ్బలాడిన తరువాత, బిగ్గరగా వేసిన కేకలు విని తోవను పోవు బాటసారులెవరోవచ్చి వారిని విడిపించినారట. వారు తలమీద దెబ్బలు తగులుటచేత నోపికచచ్చి, కాళ్ళీడ్చు కొనుచు వెనుకకు వచ్చినారట.

పోలీసువాని పుస్తకము జేబునుండి చురుకుగా వెలుపల కు వచ్చినది. అతడు మాత్రము తడుముచు వ్రాత ప్రారం భించినాడు.

"అతడే మాదిరిగా నున్నాడు? వాని వాలక మేలాగున నున్నది. సరిగా చెప్పుము." అని యడిగినాడు.

"అతడు లావుగా పొడుగుగా నున్నాడు. పెద్ద కళేబర ము. ఊదాకమీజు, బూడిదరంగు నల్లకోటు, వెనుకకు బిగతీసి విరచికట్టిన పంచి—భుజమున తుపాకి—తలకు పాగ——" అని చెప్పును-నాకస్మికముగా నాగి చాల దూరమునుండి యా గుంపువైపు వచ్చుచున్న మానవు నొకనిని గుడ్లు తెరచుకొని చేయి చాపి చూపినాడు.

"ఆ! అదిగో! అతడే! ఎంతమాత్రము సందేహము లేదు. తుపాకి, దుస్తులు, అచ్చముగా నతడే! ఎంతమాత్రము తేడా లేదు. ముఖమునకు గుడ్డమాత్రము లేదిప్పుడు. ఎంత మొండితనము" అన్నాడు.

రామచంద్రమును గోపాలమునంతవరకు శెట్టిమాటలు విని యానందించుచున్నారు. కాని హఠాత్తుగా శెట్టిచూపించి

---

నవైపు చూచి కంగారు పడినారు. అనచ్చుచున్నది వారి ధన రాజు. అతనిదుస్తులు సరిగా శెట్టి వర్ణనకు సరిపోయియున్నవి.

అక్కడ చేరిన వారందరు ధనరాజే యపరాధి యని సిరపరచినారు. అతడు మాత్రము గంభీరాకారుడు కాడా! పెద్ద కళేబరము కాదా?

"అవును. ఇతడే యయి యుండును" అని గుంపులోని వాడొకడు కేక వేసినాడు.

మరియొక క్షణములో పదిమందియు ధనరాజు చుటు చేరినారు.

"అవును. అతడే. ఆతుంటరి యతడే." యని కుమార శెట్టి కేక వేసినాడు.

గోపాలము తీవ్రముగా మధ్య ప్రవేశించి "అతడు కాడు. అతడు ధనరాజు మావాడు. దొంగలలోని వాడు గాడు" అని గంభీరముగా గద్దించినాడు.

"ఏమి? నన్నాలా గనుచున్నారా మీ రందరును!" అని ధనరాజు కండ్లెర్రచేసి నలుప్రక్కల తీవ్రముగా చూచినాడు.

మరుక్షణమున నాత డా శెట్టిద్వయముమీద పడియుండును. కాని పోలీసుజవా నడ్డుపడి వారించినాడు. ధనరాజు నతడుకూడ నెరుగును. అతడు కోమటి కుమారుల వైపు తిరిగి "అయ్యా! మీరు పొరబడు చున్నారనుకొనియెదను. ఇతడు చాల మర్యాదగలవాడు. నే నెరుగుదును. మీరు పొరపాటు పడుచున్నారు అన్నా డు.

"అహా! ఎంతమాత్రము. ఇతడే యతడు. మేము ప్రమాణము చేసి చెప్పగలము. నీవు మొగమోటపడి వానిని విడిచిపెట్టిన నీ సంగతి తేలగలదు." అన్నాడు కోమటి చిన్నవాడు.

"అలాగా? సరే మంచిదే. తరువాత మీరే తెంపలు వేసికొన గలరు. అయ్యా! ధనరాజు! నీ వింతవర కెక్కడనున్నావు? ఎవరయిన నీ పక్షమున సాక్ష్యము చెప్పువారిదగ్గర నున్నావా?" అని యడిగినా డతడు ధనరాజువైపు తిరిగి.

"నేను తుపాకి పట్టుకొని యొంటరిగా పిట్టలకొరకు పోయి కొట్టుకొని వచ్చినాను. ఇదియేనాకు సాక్ష్యము" అన్నాడు ధనరాజు.

అటులైన వీరు నీపైన చెప్పిననేరమునకు నీవు నావెంట స్టేషనుకు రావలసియుండును. నాకు నమ్మకము చాలకపోయి ననుతప్పదు. నిన్ను జామీనుమీద విడిచిపెట్టవచ్చును" అన్నాడు పోలీసుజవాను. ధనరాజు వానివెంట బయలుదేరినాడు.

"సిగ్గుమాలినపని!" అనుచు రామచంద్రమును, గోపాలమును ధనరాజువెనుక నడచుచు "ధనరాజూ! నీవు త్రోవలో నెవరినికూడ కలసికొనలేదా?" అని అడిగినారు.

"లేదు. మీరు బసకు పొండు. నేను జామీనుమీద విడుదలయయి యిప్పుడే రాగల ననుచున్నాడు పోలీసాయన. నాకువచ్చిన భయములేదు." అన్నాడు.

"అవును. రామం నీవు వెళ్ళు. మే మిప్పుడే రాగలము" అన్నాడు కృష్ణుడు.

దానితో రామచంద్రము వెనుకకు తిరిగి పోయినాడు.

రామచంద్రము తిరిగిపోవుచు, నక్కడ తీర్థము నిమిత్త మేర్పడిన యొక పెద్దమదరాసు కాఫీహూటలునకు పోయి ఫల హార మారంభించినాడు. అతడు కావలసిన దండుకొని తిని కాఫీ చల్లారపెట్టుకొనునంతలో 'హాలు' చివర నొక వెర్రికేక వినపించినది. దానివెంటనే దెబ్బకొట్టినటుల దబేలుమను చప్పుడును, మానవకళేబరము క్రిందపడినటుల మందమైన యలుకడయును వినపించినవి. ముఖములకు ముసుగువేసికొనిన మానవులు ముగ్గురు లోపల ప్రవేశించుచున్నారు. అందులో నొకనిదగ్గర మంచిరకపు తుపాకియును, ఒకనిదగ్గర పిస్తోలును, మూడవవానిదగ్గర బల్లెమును యున్నవి.

అందులోని యొకడు గంభీరముగా "చేతులు మీద కెత్తుడు! అందరు! ఏమియుచేయ ప్రయత్నించకుడు! పిస్తోలు పేలగలదు. జాగ్రత! కదలకుడు. ఎవరయినను సరే!" అని గద్దించినాడు.

చేతులు మీదకు లేచినవి. అందున్నవారిలో నొకరి దగ్గరయినను ఆయుధము లేదు. అం దాశ్చర్య మే మున్నది! ఒక రిద్దర మన్యప్రదేశములవారి మొలలలో పొడుగుపాటి సూరకత్తు లున్నవి కాని తుపాకులముందవి యేమిప్రయోజ నము? ఒక్కరును కదలలేదు.

మిగతవారిలాగుననే తానుకూడ చేతులు మీదకెత్తు చు రాముడు స్పష్టముగా "ఏకాంక్షియును, జోగులును, సోము

లును. ముసుగులు వేసికొనినను నేను వారిని గురితించగలను"
అన్నాడు.

ఏకాక్షి తిరిగి "అందరును కూడిన్నై పునసున్న యాగోడ దగ్గరకు పోయి ముఖములు దానివైపు పెట్టుకొని నిలువుడు, ఒకరివెనుక నొకరు. చేతులు తలలమీద చేర్చుడు ఊ. త్వరగా కాలము చాలదు." అని యాజ్ఞాపనగా గద్దించినాడు.

వేరుగతిలేక వారంద రతడాజ్ఞాపించినటుల చేయకతప్పి నదికాదు. బల్లె మున్నవా డొక కిటికీదగ్గరను, తుపాకి యున్న వాడు రెండవకిటికీదగ్గరను కాపున్నారు. మూడవవాడు చేతిలోని పిస్తోలుకొన యాడించుచు గోడవైపు తిరిగి వరుసగనిలిచియున్న వారిదగ్గరకు పోవుచున్నాడు—వరుసగ నందరిజేబుల తడుముటకు. అంతలో నాకస్మికముగా వెనుకనుండి 'ధాం' అని చప్పుడయినది.

---

ర

గోపాలకృష్ణుడు ధనరాజువెంట పోలీసుఠాణాకు పోయి నాడు. నేరముమోపినవారు పొరపాటు సరుదుకొని, కేసు దిగతీసికొనిమెదరని యత డభిప్రాయపడినాడు. కాని వారి కందు గట్టినమ్మక మున్నందున యట్టిపని జరుగలేదు.

„సరే! మంచిది. నే నిదివరలో చెప్పినటుల మీరు నిశ్చ యముగా పొరపడినారు. మీరు కాదనిన నేను పుస్తకములో వ్రాసికొనక తీరదు. మీరు రేపు మేజస్ట్రీటుగారియెదుటకు రావలయును. అక్కడకే పీనిని తీసికొనిపోవలసి యున్నది" అన్నాడు పోలీసుజవాను.

అప్పటికి సంకెలలు లేకపోయినను ఠాణాలోనున్న ధనరాజును విచారపూర్వకముగా చూచి కృష్ణుడు "తరువాత నేమి జరుగును?" అని యడిగినాడు.

"ఇతనికి వ్యతిరేకముగా తగినంత సాక్ష్య మున్నదో లేదో, నేరము ఋజువగునో, కాదో యని యక్కడ విచా రణ జరుగును. అయ్యా! మీ రిక్కడ సంతకము జేయుడు" అని వారిచేత సంతకము చేయించుకొని వారిని పంపివేసి ధన రాజువైపు తిరిగి "అయ్యా! నేను నిన్ను గదిలో బంధించను. ఇనస్పెక్టరుగారు వచ్చువరకును నీవు వెలుపలనే స్వేచ్ఛగా కూరుచుండవచ్చును" అన్నాను.

ప కా క్షి

అరగంట గడచిపోయినది. వేరుపనిలో నుండుటచేత యినస్పెక్టరంతవరకక్కడకు రాలేదు. ధనరాజు నిర్విచారముగా చుట్టకాల్చుకొనుచు కూరుచున్నాడు. అమాయకుడగుటచేత ముందు జరుగు కథ వానికి తెలియదు. కుమారవాంఛయుత్సాహమునకు భంగము కలిగినదనే వాని విచారము.

చివరకతడు కృష్ణునివైపు తిరిగి "బాబూ! నాకేమియు తొందర లేదు. నాకిప్పుడు నీవున్న లాభమును లేదిక్కడ. నీవుకూడ పోయి రామునితో కలసి ఖుషాలాసగా తిరుగు. నే నొకవేళ రాకపోయినచో నీ విక్కడకు రావచ్చును తరువాత. వెళ్ళునాయనా" అని బలవంతము చేసినాడు.

కృష్ణుడు నిరాకరించినాడు. కాని ప్రయోజనము లేకపోయినది. ధనరాజు మరియు మరియు పట్టుపట్టుటచేత మరల రావచ్చునని కృష్ణుడు వానిని విడచి వెళ్ళినాడు. పోలీసుస్టేషనొక చివరను కాఫీహోటలొకచివరను రెండును యొక వీధినే యున్నవి. అతడు నడచుచు కాఫీహోటలు చాల నిశ్శబ్దముగానుండుట గురుతించియు పరధ్యాన్నముగా ముందునకు పోవుచు, బాటప్రక్కను కొంచెము లోపుననున్నదయినను హోటలువైపు కన్నువిసరి చూచినాడు. హోలులో మానవులెవ్వరును కనుపించలేదు. కిటికీదగ్గర లోపలగా తుపాకి యెత్తిపట్టి తీక్ష్ణముగా నిలచియున్న మానవాకృతి మాత్రము వాని కంట పడినది.

మరుక్షణముననే యతఁడు కిటికీ క్రింద క్రుంగి కూరుచు న్నాఁడు. చేతిలోని పిస్తోలు సర్వసిద్ధముగా నున్నది. అంత లో వాని కీచుమాటలు వినుపించినవి లోపలనుండి.

"ఎవరయినను సరే. కాలు కదపినచో బుర్ర ఊడకల దు. జాగ్రత్త" అని- అది యేకాక్షిగాని స్వరమని యతఁడు సులువుగా గ్రహించినాఁడు.

కృష్ణుఁడు, లోపలివారు కిటికీలోనుంచి కనుపించువరకు నెమ్మదిగా తలయెత్తినాఁడు. ఏకాక్షి నెమ్మదిగా మానవ పంక్తిలోని చివరవానిని సమీపించుచున్నాఁడు. కిటికీదగ్గర కావున్న యాతఁడు కృష్ణున కిప్పుడు స్పష్టముగా కనుపించు చున్నాఁడు. వాని దుస్తులు, వాని యాకారము సరిగా ధన రాజు వాటిని పోలియున్నవి. కోమటిపిల్లకాయలు పొరపడుట లో దోషమేమియు లేదు.

మొదటిభాగము సమాప్తము.

దీని తరువాయికథ రెండవ భాగములో చూడుడు.



రాజన్ ప్రెస్, రాజమండ్రి.

# చ మ త్కా ర ము

" రామలక్ష్మి! నీ ప్రశ్న బాగుగనే యున్నది కాని దానికి సమాధానము కూడ మాకన్న నీవు చెప్పిననే బాగుం డు ననుకొనియెదను" అన్నది.

"అవునో! నీవు చెప్పినది బాగుగనే యున్నది. రామ లక్ష్మి మన యందరలో బాగుగ చదువుకొనినది ......" అను నంతలో నడ్డువచ్చి—

"ఆ! మీరు మాత్రము చదువుకొనలేదా యేమి!" అ న్నది రామలక్ష్మి.

"అందర మొకటే తరగతిగా" అన్నది చంద్రకాంతము.

"తరగతి కేమిగాని ......" అను నంతలో మరియొక పిల్ల అడ్డువచ్చి—

"అవునులే చదువుకొన్నాము కాని నీకున్న తెలివి తే టలు ప్రపంచకజ్ఞానము..."

"అవునో; అంతవరకు వాస్తవమే. లోకానుభవము మాకన్న కొద్దియో గొప్పయో నీ కెక్కు వనియే చెప్పవలసి వచ్చును. అందుచేత నీ ప్రశ్నకు సమాధానము..."

"అసలా ప్రశ్న యేమి!" అని యొక పిల్ల యడిగినది.

"ప్రశ్న కేమున్నది. ప్రపంచకములో..."

"నేను చెప్పుతానుండవో. ప్రపంచకములోని యన్నిటిలో నే వస్తువునందు రుచియెక్కువ యున్నది, అని" అన్నది.

అందరొక్క సారిగా పక్కున నవ్వి నానందించ సాగినారు.

చాలాకాలమునాటి సంగతిది. ఒకపెద్ద పల్లెటి గ్రామములోని నూతిదగ్గర చేరి నీళ్లు తోడుకొనుచు పలువురు బాలికలొండొరులతో కావించుకొనుచుండిన సంభాషణ యిది. వారందరు సమాన రూపురేఖా విలాసములు కలవారు కాకపోయినను వయసున నించుమించు సమానులే. వారి వయి నయినను సుమారు పండ్రెండు సంవత్సరము లుండును. ప్రపంచక సంబంధమైన బెడద యేదియులేక వారొండురులతో కులాసాగా మాటలాడుకొనుచు హెచ్చరికగా కబుర్లు చెప్పుకొనుచు నానందించు సంతలో నొకయామె నోటినుండి బయలుదేరిన దా సమస్య, ఏమని? 'ప్రపంచక మంతటిలోను యేవస్తువులో రుచి మెక్కువ యున్నది' అని. ఆ ప్రశ్న బయలుదేరదీసినది రామలక్ష్మి యను నొక బ్రాహ్మణ బాలిక.

ఆ రోజులలో స్వార్థజీవులును స్వప్రయోజనపరులు నగు బ్రాహ్మణులును, అసూయాహృదయులును అసహానపరులు నగు బ్రాహ్మణేతరులును చాలతక్కువగా నుండుటచేత—

అస లారోజులలో నుండుట కవసర మంతగ లేదు లెండు—బ్రా హ్మణ బ్రాహ్మణేతర సమస్య బయలుదేరి యయికమత్యము నుపాడుచేసి యంతఃకలహములు తెచ్చిపెట్టుటలేదు. కనుక నందరన్నదమ్ముల్లె లక్కపెల్లెంౘ వలె కలసి మెలసి యుండెడివారు. అందుచేత నా నూతిదగ్గర నీరుతోడుకొను బాలిక లోక కుల మునకుగాని యొక తెగకుగాని చెందియుండక నన్ని బాపతులకు చెందియున్నటుల వారి వాలకములును, మాటలును చెప్పుచున్నవి.

రామలక్ష్మి తన సమస్యకు తానే సమాధానము చెప్పవలసి వచ్చుటకంత యిష్టపడకపోయినను నలుగురును ప్రోత్సాహించుటచేత చెప్పక తీరనందున భిడియపడుచు నెమ్మదిగా "అమ్మాయిలు! మీరందరు నన్ను బలవంతము చేయుటచేత చెప్పవలసి వచ్చి చెప్పుచున్నాను. మీ రేమియు ననుకొనకూడదు. తరువాత మరియొక సంగతి. వెర్రియో మొర్రియో నాకు తోచినది నేను చెప్పిన తరువాత మీరు కూడ యెవరికి తోచినది వారు చెప్పవలయును. చెప్పకతీరదు సుమండీ. ముందు చెప్పువారి మాటలు విని కేలినేసి కేరింతలు కొట్టి వెళ్ళిన నే నొప్పుకొనను. ఆ! తరువాత మీయిష్టము మరి" అన్నది.

ఆ మాట కంద రామోదించి, యామెరతు కంగీకరించిన తరువాత నా బాలిక తీరుబడిగా "ప్రపంచకముఃలోని యన్నిటి

లోను మాంసములో రుచి యెక్కువ యున్నదని నా యభిప్రాయము" అని చెప్పినది. మిగత బాలిక లందరొక్కసారిగా కెవ్వుమని కేకవేసి చప్పట్లుకొట్టి గొల్లుమనిరి.

తరువాతి వంతు కోమటిపిల్లది. ఆమె కొంచెము యుక్తి చేసి తప్పించికొన ప్రయత్నించినది. కాని సాగనందున నెమ్మదిగా "ప్రపంచక మంతటను భర్తలో యెక్కువ రుచియున్నది" అన్నది. ఆ మాట కందు కొందరు సిగ్గుపడుటచేత నంత యల్లరి లేకుండగనే తెమిలిపోయినది.

తరువాత కమ్మవారిపిల్ల. ఆమెకు తోచినటులగా "డబ్బు సంపాదనలో రుచి యెక్కువయున్నది" అన్నది.

మరియొకపిల్ల క్షత్రియపిల్ల "సారాలో రుచియెక్కువ" అన్నది,

"ఛా!," అన్నదొక పిల్ల.

"అంత రుచియు రుత్తయు లేనిది వేరొకటి లేదీ ప్రపంచకమున." అన్నది మరియొక పిల్ల.

"అవు నవును. అంతకన్న పేడనీళ్ళు నయము!" అన్నది మరియొకతె.

ఆఖరునకు మిగిలినది కళావంతులపిల్ల మాటలాడ కూరకున్నది. ఆ పిల్ల వంతు వచ్చినదనియును, చెప్పక తీరదనియును మిగత బాలిక లందరును బలవంతము చేసిరి. అందుచేత

నా పిల్ల "అమ్మాయి! నాకు తోచినదేదియో, వెర్రియో మొ ర్రియో చెప్పుదును. అది బాగుండలేదనిగాని, సరిగాలేదని గా ని మీరనిన నే నొప్పుకొనను మరి. అందు..."

"ఎందులకే యీ యుపోద్ఘాత మంతయును. మావలె తోచినదేదో..."

"కూయుము. చేత గాకపోయిన................"

"ఆ! ఆ! చేత గాకపోయినలు లే విక్కడ. సరిగా నా లోచించి తోచినటుల చెప్పి తీరవలసినదే. రామలక్ష్మి చెప్పి నదికాదా యీ మాట ముందు" అన్నది కోమటిపిల్ల.

"అవును. అంతవరకు నరే. ఏదియో యొకటి చెప్పితీరవ లె. తప్పదు-" అన్నది మఱియొక పిల్ల.

"అయిన చెప్పుచున్నాను వినుడు. ప్రపంచకములోని యందరకును, ప్రపంచక మన్నిటిలోను యెక్కువ రుచియయి నది అబద్ధము. అందులోనే రుచి యెక్కువ" అని యూరకున్నది.

ఈ సంభాషణ యీ మూలాంతము చాటున నొక యింటి క్రీనీడను నిలచి శ్రద్ధగా వినుచున్న యిరువుర మానవుల యాశ్చర్యమునకు మేరలేదు. పిల్లలు చూచిన చిన్నవాండ్రు అభిప్రాయములు చూచిన యనుభవపూరితములై విశేష లోకజ్ఞానము కలిగినవారి వాటివలె యపారములై పెద్దవిగానున్నవి.

ఆ చెంతను నిలుచున్న నా యిరువురు మానవులలో నొకరు రెండవ వానితో "నీవును వింటివికదా వారి మాటలు.

నే నిప్పుడు పోయి వారి యభిప్రాయములు ఋజువు పరచు మని యడిగెదను” అన్నాడు.

అంత రెండవ యాతడు “ఆహా! ఎంతమాత్రమును వలదు. మన మిప్పుడు వారిని సమీపించినచో......” అను నంతలో మొదటి యాతడు వాని మాటల కడ్డు వచ్చి, “స మీపించినచో మనము దొంగల మనుకొనియెద రాయేమి! మంచి మాటయే” అన్నాడు.

“చిత్తము. దొంగల మనుకొనరు గాని పడుచుపిల్లల వెం ట బడినందులకు మరియొకలాగున ననుకొనిపోయెద రేమో నని...” అను నంతలో మొదటి యాతడు మందహాసముచేసి,

“ఆ! మంచికథ. అయిన నేమిచేయుద మిప్పుడు. మన నిజవృత్తాంత మిప్పుడు వెలిబుచ్చి...”అనబోవుచుండ రెండ వయాతడు “మన మనవసరముగా బయలపడవలసిన యగత్య మేమి వచ్చినదిప్పుడు. ఇప్పుడు రాత్రి యెంతయో మిగిలియుం డ లేదు గదా! అందుచేత మనము తిన్నగా యిండ్లకు పో యిన తెల్లవారిన తరువాత వారి నందరను తమసముఖమునకు రావించి......” అనునంతలో మొదటి యాతడు “అవును అది బాగుగనే యున్నది. కాని వీ రందరు చెదరిపోయినచో వారి జాడలు మనకు తెలియవచ్చుట యెట్లు!” అని యడిగినాడు.

“చిత్తము. అందులకు నన్ను నియోగించుడు. నే నీ చుట్టుప్రక్కల మనుష్యులను కాపుంచి వారి సంగతి సమాచా

రములు యునికిపట్లు శ్రద్ధగా గమనించి, దర్బారువేళకు వారి నందర నచ్చటకు తోడ్కొనివచ్చు నేర్పాటు కావించెదను.” అని వినయపూర్వకముగా సమాధానము చెప్పెను.

వా రిరువు రెవరో మా పాఠకులకు బోధపడిన సరియే గాని పడనివారికి మాత్రము. వా రా పట్టణమేలు రాజును, వాని ప్రధానియును. పట్టణప్రజల పరిస్థితులును, వారి కష్ట సుఖములును, ప్రభుత్వములోని లోటుపాటులును, ప్రభుత్వో ద్యోగుల మంచిచెడ్డలును స్వయముగా గురుతించి గ్రహించుటకై యప్పటి యాచారమును బట్టి, రాజు యమాత్య ద్వితీయుండై రాత్రివేళల మారువేషముల నగరసంచారము చేయు చుండుట వాడుక. అంతియేకాని స్వార్థపరు లగు సామాన్య నవుకర్ల మాటలే యాధారముగా దీసికొని ప్రభువులకు చెవులే గాని కన్నులులేవను సామెత సార్థకపరచు రకములోనివాడు కా డాతడు. అందుచేత నగరసంకీర్తనము గావించి యిక్కడకు వచ్చునప్పటి కా వేళ యయినది.

మంత్రి చెప్పిన యాలోచనప్రకార మాచరించ స్థిర పరచుకొని, బాలికలు దాటిపోకుండ కనుమెలగి యుండవలసి నదని మరి మరి హెచ్చరించి రాజు మారుతోవను యిల్లు చేరినాడు.



తెల్లవారినది. సూర్యోదయమయి చాలసేపయినది. రాజసభాభవనము రాజపరివారముతోడను, రాజసభికులతోడను, ప్రేక్షకులతోడను నిండి కిటకిటలాడుచున్నది. రాజుగారా నాటి యుదయమున నిల్లు చేరినతరువాత యధికారవర్గమును పిలచి సంగ్రామాలాంతము సంక్షేపముగా తెలియపరచి, సభాలంకారము సత్వరమ సంపూర్తిగావించవలయునని కావించిన యాజ్ఞాపనయే నాటిసభ యెప్పటికన్న ముందుగ నిండి పోవునటుల కావించినది.

రాజుగారి యాత్రమునకు మేరలేదు. అంతవరకు సభాభవనము ప్రవేశింపని మంత్రిగారకు వర్తమానమంపి, రావించి, సంగతేమయినదని ప్రశ్నించెను. మంత్రి చాల విధేయతగా వంగి నమస్కరించి "ప్రభూ! సంగతంతయు తమరు సెలవిచ్చినప్రకార మేర్పాటు కావించితిని. వారందరంతటెంతటి రాగల రిక్కడకు. దర్బారునకు హాజరు కానాజ్ఞలంది యున్నారు. అందరు తప్పక వచ్చెదరు కాని......" అనునంతలో రాజు వానిమాట కడ్డువచ్చి "ఏమది! 'కానీ' యనుచున్నావు? రాజాజ్ఞ నుల్లంఘించి, రానిరాకరించిగా యెవ్వరయిన?" అని గట్టిగా నడిగినాడు. రాజాజ్ఞయను దాని ప్రభావము పూర్తిగా నెరిగి,దాని నుల్లంఘించుటయన నేమో చాల

నొక రిద్దరు కారణాంతరములచే నియ...
రాజులరేమో నని యుంటిని గాని మరియొకటి ...
వువారు నా యజ్ఞానమును మన్నించి......" అ...
రాజు వాని ప్రార్థన కడ్డువచ్చి "ఆహా! దాని కేమి? త్వర...
వచ్చి వారు వారు నుడివిన వాక్యములలోని యదార్థముల
సమర్థించుట వినవలయు నను కుతూహలమే న న్నింత తొం
దర గావించినది. నీవు వేరుగ భావించి నొచ్చుకొనకుము."
అను నంతలో నాటి యుదయమున నూతిదగ్గర చేరిన బాలిక
లక్కడ చేరి, యుచిత మర్యాదల నంది రాజసభాప్రవేశము
గావించి, భయభక్తులతో రాజునకు నమస్కరించి వారికొర
కేర్పరుపబడిన యుచితాసనముల నలంకరించిరి. అం దొకరు
తక్కువ యుండుట గ్రహించియు మంత్రి వెలిబుచ్చలేదు.

అంతలో రాజుగారి సన్నయే యాధారముగా నా ప్రధానామాత్యుడు లేచి వార లచ్చటి కేల రావింపబడిరో తెలియక యాశ్చర్యమగ్నమానసలై నివ్వెరపడి చూచుచు న్న యా బాలికల నుద్దేశించి "బాలికలారా! మీ రిప్పు డెవరి సమక్షమున నున్నారో యెరుగుదురుగదా? సకల ధర్మ

తెల్లవారినది. సూర్యోదయమయి : మననేల యింకను రాజసభాభవనము రాజపరివారముతో స్వామివారి బావిదగ్గర ను, ప్రేక్షకులతోడను నిండి షణ మీకుజ్ఞాపకముండి యుం నాటి యుదయమున యందెవ్వరును యవునని కాని కాదని మొసగకుండ యాశ్చర్యమును వెలిబుచ్చి పిలచి సంగ హించి తిరిగి ప్రారంభించి "అమ్మా! మీరంత సభాలంఖ్చర్యమును వెలిబుచ్చ నక్కరలేదు. మీరప్పుడా సంభాషణకావించు చుండివప్పు డాచెంత క్రీనీడను నిలచి సంభాషణ యామూలాంతము వినిన ప్రభువువారి దగ్గర దాచవలసిన దేదియును లేదు. న్యాయా న్యాయ విచక్షణ దక్షులగు ప్రభువు వా రట్టివేళ లక్కడుండుటకు నాశ్చర్య మేమున్నది. అదియునుగాక వారంతటి కష్టనిష్ఠురములకోర్చి వేయికన్నుల కనిపెట్టి చూచుచుండుట చేతనే ప్రజ లంత సౌఖ్యముగా కాల క్షేపణ చేయుచున్నారు. అందుచేత నమ్మలారా! మీ మీ వాక్యములలోని యదార్థములు నుదాహరణ సహితముగా ధృవ పరచ వలయునని ప్రభువు వారి తరపున నేను కోరుచున్నాను." అని యా బాలికలలో మొదటియామె నుద్దేశించి "అమ్మా మొదటివంతు నీయది" అని చెప్పినాడు.

అంత రాజు "అమ్మాయి! నీవు చెప్పినదేమని? అన్నిటి లోనను మాంసములో రుచియెక్కువ యున్నదనియా!" అని ప్రశ్నించి యామెయానని తలయూచి నందున తిరిగి "అమ్మా

యయినదని చెప్పగలుగుటకు ...
గ్రహించ గలిగితివి" అని యడిగినాడు.

ఆ బాలిక వినయవిధేయతలు వెలిబుచ్చ...
మృదుమధురస్వరమున నీ రీతిగా చెప్పజొచ్చినది. "...
నాకు తోచినంతవరకు మనవి చేయుచున్నాను. అందలి ...
నిజములు, మంచిచెడ్డలు విచారించి మన్నించ వేడుచున్నా
ను. సృష్టిలోని యన్ని పదార్థములలోను మాంసము రుచికర
మయిన దనియును, అంతటి రుచి కలదని తెలిసి యుండియు
పాపహేతు వయిన నట్టి వస్తువును విసర్జించుటయే మహత్తరకా
ర్య మనియును శరతల్పగతు డైన భీష్ముడు తన్ను సందర్శించ
నేతెంచిన ధర్మ రాజాదుల కుపదేశించెనట. ఆ సంగతి నేను
నాబడి పంతులు చెప్పినప్పుడు నిరసించితిని. కాని యది స్వల్ప
కాలములోనే స్వానుభవ మయినది. ఎట్లన మా యింటిప్రొరు
గున కాపు లున్నారు. వారికిని, మాకును మధ్య గోడమాత్ర
మున్నది. వారి పిల్లయును, నేనును ఒకే తరగతి చదువుచుం
డుటచేత నేను వారి యింటికి తరుచు పోవుచుందును. వారు
భోజనములో మాంసము తిని దుమ్ములు నాకి చీకి పారవేయు
చుందురు. ఆ పారవేయబడిన దుమ్ములు కాకు లెత్తుకొని
పోయి, వాటాకుపచ్చ తోటకాకులు పీకుకొని పోవునను కం

౨

తెసుచుండును.

తెల్లవారినది. సూర్యోదయమయి .పి జారి క్రింద మా రాజసభాభవనము రాజపరివారముత్టో వారిదొడ్డిలో బయలుదేరి ను, ప్రేక్షకులతోడను నింకి ాదొడ్డంతయు కూడ వ్యాపించినది నాటి యుదయమున క్రిందజారిన దుమ్ములు కనుపించి నంతనే ప పిలచి సంగ ము నొంది కుక్కలవి దొరకవుచ్చుకొని వాటి సహ సభా ్యయులు రాకుండ నవి మా దొడ్డిలోని యే మారుమూలకో తెసికొనిపోయి స్వాధీనము కాకపోయినను ప్రయత్నించి తంటా లుపడియయినను నమిలి పీల్చి పిప్పిచేసి విడిచి పెట్టుచుండును. ఆపిప్పిని వేలకొలది చిన్నచీమలు చేరి గంటలకొలది, రోజులకొ లది యాశ్రయించి యానందించుచుండును. దానిలో నంత రు చియే యుండక పోయినచో పుట్టినప్పటినుండి—అనగా కసా యివానిదగ్గరనుండి—కుక్కలు చావుదెబ్బలు తినుట యక్కడ నే—యెక్కువ పిప్పియై సారహీనమైనప్పటికిని సారవంతముగా జీవయాత్ర గడుపు దానిలో నెంత రుచియున్న దోనని యభిప్రా యపడి నే నా రీతి మాట లాడితిని'' అని చెప్పి యూరకున్నది.

తరువాత వంతు కోమటిపిల్లది. ఆమె చాల బిడియప డుచు "అయ్యా? నేనుచాల చిన్నదాన నయినను మాలో మే మేకాంతముగ మాటలాడుకొనుచుంటి మని యభిప్రాయము

---

దీని తరువాయి మా చే ప్రకటించబడిన 'ఏకాంతి' రెం డవ భాగము చివర చూడ ప్రార్థితులు.

